# యాచమనాయుడు

(చారిత్రాత్మక నవల)

ఉభయభాషాప్రవీణ

ప్రతాప రామకోటయ్య, బి. ఒ. యల్.




ప్రకాశకులు:

కవిరాజ పబ్లిషర్సు

తెనాలి :: మద్రాసు

 1951 [వెల రు. 1-4-0

# తొలిపలుకు

ఇందలి యితివృత్తము విజయనగరాంధ్ర సామ్రాజ్య చరమదశకు సంబంధించినది. విజయనగ రాంధ్రసామ్రాజ్య మన్నచో తళ్ళికోట యుద్ధమున నాశనమైపోయిన సామ్రాజ్యమేగదా యను నభిప్రాయము సర్వసామాన్యముగా వ్యాపించి యున్నది. హంపి శిధిలములుగూడ ఆ యూహనె బలపఱచుట కుపకరించుచున్నవి.

ఆ మహా సామ్రాజ్యము తళ్ళికోట యుద్ధముతో నాశనము కాలేదు. దాదాపు మఱియొక శతాబ్ద పర్యంతము జీవిత యాత్రను వైభవోపేతముగ నడిపినది. శత్రువులకు పక్కలోని బల్లెమైనది.

పెనుగొండనుండి కుంభకోణముదాక పర్యటించి పర్యటించి తుదిని అంతఃకలహ కారణమునం జేసి అస్తమించినది.

అయ్యంతఃకలహములకు సంబంధించిన వృత్తాంతమె ఇందు వివరింపబడినది. జగ్గరాజు వెలుగబెట్టిన విప్లవాగ్నిని మండబెట్టి వ్యాపింప జేసినవారు మాకరాజు రావెల వేంకటపతి యను వారలు.

వాని ప్రతిఘటించి వారి కుప్రయత్నములను భంగపఱచి సామ్రాజ్య సంరక్షణముచేసిన మహావ్యక్తియే యాచమనాయకుడు. ఆ మహనీయుని రాజభక్తియు శౌర్య సాహసములును ఆదర్శప్రాయములు.

ఇందు వర్ణింపబడిన దక్షిణదేశ మహామండలాధిపులైన ఆంధ్రనాయకుల వృత్తాంతములు అప్పటి రాజకీయ పరిస్థితులు, రాయలసీమవారి యాచార వ్యవహారములు విద్యార్థిలోకమునకు అవశ్య పఠనీయములు.

ఇందలి శైలి సరళముగా జాతీయముగా నుండుటకై ప్రత్యేక శ్రద్ధ తీసికోబడినది. నేటి పెద్దల యాచారము ననుసరించి విసంధి మొదలగునవి అంగీకర్తవ్యము లైనవని మనవి.

ఈ గ్రంథమును రచించుటయందు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి 'ఆంధ్రమహనీయులు'— శ్రీ శివశంకరముగారి 'వేంకటపతి 2' అను గ్రంథములు, రామరాజీయాది పీఠికలు అత్యంత ముపకరించినవి. ఆ యా గ్రంథకర్తలకు కృతజ్ఞుడను.

—ప్రతాప రామకోటయ్య

# విషయసూచిక

"గొబ్బిళి జగ్గరాజు లోకకోటియు డెబ్బదికొట్లు మాకరా
జబ్బులు లక్ష్మిమీద పదునార్గురు రావెలు వెంకు టైన మా
నిబ్బరగండ యాచ ధరణీపతి ముందట నిల్వ శక్యతే?
కబ్బిలుతేర, బెబ్బులిముఖాముఖి మేకలు నిల్వనేర్చునే."

—చాటువు

# 1. సన్నివేశము

"ముదితల్ నేర్వఁగరాని విద్యగలదే? ముద్దార నేర్పించినన్"

—చిలకమర్తి

'విజయా! కుశలమా? ఎపుడు వచ్చితివి? ఇపుడే మీ నాయనగారితో మాటలాడి వచ్చుచుంటిని.' అనుచు శ్రీరామదేవరాయలు ప్రవేశించెను.

విజయ: (వెనుదిరిగిచూచి) నేను వచ్చి జాముసేపు కావచ్చుచున్నది. కుశలముగానే యున్నాను.

విజయ తంజావూరు పరిపాలకుడగు రఘునాథరాయల పుత్రిక. ఆమె తండ్రితోఁగూడ నేడే చనుదెంచినది. అత డపుడపుడు విజయనగర సామ్రాజ్య పరిపాలకుడైన శ్రీ వీర వెంకటపతి మహారాజులవారి దర్శనార్థము వచ్చుచుండును. అపుడు విజయకూడ అతని వెంబడించి వచ్చుట ఆచారము.

శ్రీరామదేవరాయులు యువరాజగు రంగదేవరాయల కుమారుడు, విజయయు నాతడును ఆబాల్య మిత్రులు.

రామ: ఇదివఱకు వచ్చిన వెంటనే నన్ను చూచుటకు వెదకికొనుచు వచ్చెడిదానవు. ఇపుడు నేను నీకొఱకు వెదుకవలసి వచ్చినది. ఎంత విపర్యస్తము! దీనికి కారణము ఊహింపలేక యున్నాను.

విజయ: ఇందు విపర్యస్తమేమి కలదు? వచ్చుటతోడనే విచారించితిని. నీవు ఎచటికో పోతివని చెప్పిరి. ఉద్యానవనమునకు వచ్చి పూవులు కోయుచున్నాను.

రామ: మహామంత్రి గోవింద దీక్షితులవారు కుశలమా! వారియొద్ద కాణాద వైశేషికములు పూర్తి చేసితివా?

విజయ : పూర్తి అయినవి. శుక్రనీతిసారము చదువుచున్నాను. సేనాధిపతుల వారియొద్ద రణవిద్యయు నభ్యసించుచున్నాను.

సూర్యాస్తంగతు డగుచుండెను. ఆకాశము బంగారు పూత పూయబడినట్లు ప్రకాశించు చుండెను.

వారిరువురును పొదరింటి ప్రాంగణముగల శిలాసనము నందు కూర్చున్నారు. కోసిన పూవులను దండలు గ్రుచ్చుట యందు విజయ ఆసక్తయై యుండెను. కొంతసేపటికి ఇరువురును మౌన ముద్రాలంకృతులై యుండిరి.

రామ : క్రిందటిసారి మీరు వచ్చి మూడేండ్లు అయినది. ఇంతదీర్ఘ కాల మెప్పుడును మన మెడబాసి యుండలేదు.

విజయ : ఔను. రాజకార్య భారముచే తండ్రిగారికి తీరిక లేక యున్నది.

రామ : ఇచటకూడ అట్లే యున్నది. మహారాజులుం గారి ఆరోగ్యము సరిగా లేదు. కార్య భారమంతయు నాయనగారిపై బడినది.

విజయ : ఎటు చూచినను వెనుకటి దినములు మరలరావు. అపుడు మన ఆటలేమో! మన పాటలేమో! ఆ సుఖ దినములు మరల రావుగదా!

రామ : ఎట్లు వచ్చును? చూడుము- ఆపూల తీగలన్నియు నీవు క్రిందటిసారి వచ్చినప్పుడు పెట్టినవే. పూలు ఎట్టి పరిమళములు వెదజల్లు చున్నవో! మందమారుతము ఆపరిమళమును ఎట్లు సర్వత్ర వ్యాపింప జేయుచున్నదో

గమనించితివా! ఆ ఫలవృక్షములు నీవు నాటినవే కదా! ఆ పూవుల వాసనయు ఈ ఫలముల రుచియు ప్రతి సాయంకాలము నిన్ను జ్ఞప్తి కెలయించుచుండును.

విజయ : (నవ్వుచు) ఎంతచక్కని ప్రియములుపలుకుచున్నావు! ఆ వాసన, ఆ రుచి లేనిచో నన్నువుడు నేనే తెలుపు కొనవలసి యుండెడిది కాబోలు!

రామ : ఆ సంగతి తేల్చికొందమనియే ఈ మధ్య తంజాపూరు ప్రయాణమైతిని.

విజయ : మిమ్మింతగా ఆకర్షింప గల్గిన తంజాపూరు జన్మము ధన్యము. మఱి ఎందుకు రాలేదు?

రామ : మహారాజులవారి అస్వస్థతయే కారణము. మీరు వచ్చి పోయిన ఈ మూడుసంవత్సరముల నుండియు వారి ఆరోగ్యము సరిగా నుండుట లేదు. ఇపుడు వికటించినది కూడ.

విజయ : అందువలననే కాబోలు తత్క్షణమే రావలయునని దూతచే మాతండ్రిగారికి కబురంపినారు.

రామ : మీతండ్రిగారును వెలుగోటి యాచమనాయడును మహారాజులుంగారికి కేవల సామంతులే కాదు; అత్యంతాప్తులును. రాజ్యన్యవహారములు సంప్రదించుటకే వారలను పిలిపించియుందురు.

అపుడు ఆకసమున పూర్ణచంద్రుడు ప్రకాశించుచుండెను. నిండు వెన్నెలలు ఎల్లయెడల పిండి యారబోసినట్లు వ్యాపించి యుండెను.

విజయ : ప్రొద్దు పోయినది. మన మిక బయలుదేరుదము.
ఇరువురు లేచి ప్రయాణమైరి. రామదేవరాయలు ముందు నడచుచుండెను. ఆతని స్ఫురద్రూపము వెన్నెలకు వన్నె పెట్టుచుండెను. విజయాదేవి మృదుకపోల కాంతులు జ్యోత్స్నా రేఖలతో ఎకసక్కెము లాడుచుండెను. ఆమె ముఖచంద్రుని జూచి సిగ్గుపడెనా యన్నట్లు అపుడే చంద్రుడు మబ్బులలో దాగికొనియె.

# 2. సమాలోచనము

'పాటూరికి సమీపమున ఆంధ్రసామ్రాజ్యదిగ్జయ, స్తంభ మెత్తించు నాడు'

—రాయప్రోలు

రాజసౌధమున ఒక విశాల రమణీయమైన గదిలో రంగరాయలు, రఘునాధరాయలు, వెలుగోటి యాచమనాయుడు ఆసీనులై యుండిరి. రంగరాయలు మహారాజులుంగారి సోదర పుత్రుడు. యువరాజు.

రంగరాయల వదనము ధవళకాంతులు వెదజల్లుచు సాత్వికగుణ సంపత్తిని వెలార్చుచుండెను. అత్యంత సుందరాకారుడనియు నవమన్మథాకారుడనియు కవులు వర్ణించెడి అతిశయోక్తులు ఆయనయెడ స్వభావోక్తులే.

ఆతని ఆకర్ణాంత విశాల నేత్రములు సదా కరుణార్ద్ర దృష్టులను వెదజల్లుచుండును. ఉప్పొంగియుండు భుజపంజరంబులు, ఆజానువులైన బాహువులు శౌర్యస్ఫూర్తిని ప్రకటించుచుండును.

నేడా యువరాజు ముఖము విచార మేఘములచే నావరింపబడియుండెను. కాని యాతని వదనగంభీరత మాత్రము చెక్కు చెదరక యుండెను. ఆతడొక రత్న కంబళముపై ఒరుగు దిండున కానుకొని కూర్చుండి యుండెను.

ఇరు ప్రక్కల రఘునాథ యాచమనాయకులు కూర్చుండిరి. రఘునాథరాయలు తంజావూరు ప్రభువని మన మిదివఱకే యెఱిగి యుంటిమి. అతడు విజయనగర సామ్రాజ్యాధిపతికి కప్పము కట్టుచు సామ్రాజ్య గౌరవమును చెక్కు చెదరనీయక వేయి కన్నులతో కనిపెట్టి యుండువాడు. పెనుగొండను ముట్టడింప సాహసించిన గోల్కొండ నవాబును కృష్ణదాక తఱిమి తఱిమి కొట్టిన యాతని యశోగానము సామ్రాజ్యమున ఆబాల గోపాల ప్రసిద్ధమైనది. ఈతడే చేమకూరి వేంకట కవిచే విజయ విలాసమును కృతినందిన మహనీయుడు.

వెలుగోటి యాచమనాయకుడు పద్మనాయక కులాభరణుడు. వేంకటగిరి పురాధీశ్వరుడైన వెలుగోటి యాచమనాయని మనుమడు. అతడు విజయనగర సామ్రాజ్యాధిపతి సేనాపతిగను మండలాధీశ్వరుడుగను ప్రశస్తి వహించి యుండెను. ఆతని నిలువెల్ల పౌరుష పరాక్రమ రాజభక్తి సంపుటీకరణ మనియె చెప్పవచ్చును. రంగరాయల నుద్దేశించి ఆత డిటను చుండెను.

“యువరాజ మహాశయా! మీరు నూరు చెప్పుడు వేయి చెప్పుడు. రేపు పట్టాభిషేకము జరిగి తీరవలసిన దే.

ఇది మహారాజులవారి యాజ్ఞ. నాశరీరమున ప్రాణము లుండునంతదనుక అయ్యాజ్ఞ అన్యథాకరింప బడజాలదు."

రఘునాథ: నాబుద్ధికి అది ఎంతయు ఉచితమైన ఉత్తమమైన ఉదాత్తమైన ఆజ్ఞగా కనబడుచున్నది. మహారాజులా, వయోవృద్ధులైనారు. ఆరోగ్యమూ, పడలినది. చెడినది కూడ. ఇంతవఱకు ఆమహనీయుడు విజయనగర సామ్రాజ్యగౌరవమును జాగనీయక సుల్తానులకు పక్కలోని బల్లెమై యొప్పారుచు నీతి దయా సత్యయుత మగు పరిపాలనము చేయుచున్నాడనుట మనకందఱకు తెల్లమే. అంతఃకలహముల పాలై, సామ్రాజ్యము వైభవమును కోలుపోవకయుండునట్లు, ఆమహాప్రభువుచేయు నేర్పాట్లు, మనయందరకు శిరోధార్యములు.

రంగరాయలు: ఆ ప్రవరే ఖ్యలాదా! మహారాజునాజ్ఞ శిరసా వహింపవలసినదే. కాదని ఎవరందురు? అనగలరు? మీవంటి ఆప్తుల హితోపదేశము సర్వథా అంగీకరించి తీరవలసినదే. దీనికి సందేహము లేదు.

యాచమ: యువరాజా! మఱి యీ వెనుక ముందు లేల?

రంగ: యాచమనాయడా! నేను చెప్పునది సావధానముగా వినుము. శ్రీకృష్ణదేవరాయాది మహాసార్వభౌములకాలమున దేవేంద్ర వైభవ మనుభవించిన ఈ మహా సామ్రాజ్యము తళ్లికోటయుద్ధమున తలవాల్చవలసి వచ్చినది. ఆ జీర్ణసామ్రాజ్యమును పునరుద్ధరించి కీర్తి



గాంచిన వారిలో మనమహారాజు ముఖ్యుడు. అదియెల్ల రకు అంగీకర్తవ్యమైన విషయము.

రఘు : యాచ : మీరు సత్యమునే వచించుచున్నారు.

రంగ : కాదుగు. మనసామ్రాజ్యమునకు బహిశ్శత్రులచే తళ్ళికోటయుద్ధమున శాహ్యాస్వరూప వికారముకల్గినది అయినను అంతస్సారము చెడలేదు. కావున మఱల యిప్పుడిప్పుడే కోలుకొనుచున్నది. నేను మీరందఱు సంకల్పించియున్న ఈ పట్టాభిషేక కారణమున ఈ ఆంధ్రసామ్రాజ్యము అంతఃకలహములచే అంతస్సారము గూడ కోలుపోయి స్వస్వరూపనాశనము చేసికొన గలదు. ఇదియే నాభయము. తెలిసి తెలిసి ఈ అకార్యమునకు నామనస్సు అంగీకరింపలేక యున్నది. ఈ మహాంధ్ర సామ్రాజ్య సంరక్షణము మన యందఱ కర్తవ్యము. మహారాజులవారి యాజ్ఞా పరిపాలనకు నేను సర్వదా బద్ధుడనే ఇంతవఱ కెప్పుడును వారి యాజ్ఞలను మీఱినది లేదు. సామ్రాజ్యక్షేమమునకు మన సర్వస్వము బలి ఈ నవలసిన సమయమిది.

రఘు : మహానుభావా ! మీరు చెప్పినది కాదనజాలను. అంతఃకలహములు చెలరేగు సావకాశములు లేకపోలేదు. అయినను ఈ అల్పాల్ప విఘ్నములను అణచివేయగల శక్తి—సామ్రాజ్యక్షేమమును కాపాడగల సమర్థత— మా బాహువులయందు లేకపోలేదని మా విశ్వాసము.

యాచమ : యువరాజా ! మీరు అనవసర భయములకు

లోనగుచున్నారు. సామ్రాజ్యక్షేమమునకు ఎట్టిలోటును
రాజాలదు. మీరుపట్టాభిషేకమునకు సంసిద్ధులై యుండ
వలసినదని నాప్రార్థన. మహారాజులవారు రేపే మీకు
పట్టాభిషేకము జరుగవలయు ననుచున్నారు.

రంగ: అంతః కలహ వ్యవహారములను మీరింత చులకన
చేసి మాటలాడవలదు. ఆ వ్యవహార వివరమును నేను
బాగుగాగమనించు చున్నాను. మహారాజ్ఞి కొండమ దేవి
ప్రళయ కావేరియందును, ఆమె సోదరుడు జగ్గరాజు
సెంటుధోమునందును పరిపాలకులుగా నుండి అధికార
మును సాగించుచు ఊరకయే యుండలేదు' కొండమ
దేవిని సంతోషపెట్టుటకై మహారాజు తన యాంత
రంగిక మిత్రములను గూడ వదలుకొను చున్నాడు.
ఈ మూడునాలుగు సంవత్సరములనుండి జరుగుచున్న
సంఘటనలు మహాద్భుతములు. కొండమదేవి మహా
రాజును పూర్తిగా వశము చేసికొనినది. ఆమెకు
జగ్గరాజు చేదోడు వాదోడుగా నున్నాడు. సామ్రాజ్యా
క్రమణము చేయుటకై వారపుడే ఔరసునిగూడ
సృష్టించినారు, కొండమదేవి - తమ పుట్టినింటి యాశ్రిత
వర్గమునకు జేరిన బ్రాహ్మణస్త్రీ యొకతె గర్భము
ధరింపగా, పుట్టబోవు శిశువును తన కిచ్చునట్లుగా
ఆ కుటుంబముతో నేర్పాటు చేసికొనెను. తానును
అప్పటినుండి గర్భము ధరించుచున్నట్లు నటించుచుం
డెను. ఈమోసపు పన్నుగడ మహారాజులవారికి కూడ

తెలియును. తుదకా బ్రాహ్మణ శిశువును ఉచిత సమయమున రహస్యముగా తెప్పించి తనకుసంతానము కల్గినట్లు రాజ్యమంతయు ప్రకటింపజేసెను. అనంతర మా బిడ్డను యువరాజుగ సహితము వెల్లడించెను. ఈచిత్ర సంఘటన సంస్థాన రాజవంశీయులలో ఆశ్రిత వర్గము వారిలో గుజ గుజలు వొడమ జేసెను. ఇప్పుడా బాలుడు మూడేండ్లవాడు. అతని పట్టాభిషిక్తునిగా జేయుటకు ఆమె మహా ప్రయత్నము చేయుచున్నది. సోదరుడగు జగ్గరాజు సాహాయ్య సంపత్తికూడ ఆమెకు లభించినది. ఈవిషయములు మీకును శ్రవణ గోచరములై యుండునని కొందును.

రఘు : నేమును వింటిమి. మహారాజులవారు అత్యంతము విసుగుచెంది యున్నారు. ఈకుట్ర యంతయు వారికి తెలియును. ఆ బాలునియందు మహారాజుల వారికి ఆదరము ఏమాత్రము లేదు. సామ్రాజ్యభారము నీవె వహింప వలయునని వారి యాజ్ఞ. వారు నిన్ను పూర్వము యువరాజును చేసినారు. ఇపుడు మహారాజును చేయనున్నారు. దీనికెట్టి అభ్యంతరములు కలుగరాదు.

యాచమ : ఇంతమాత్రమున అంతః కలహములు జనించునని, సామ్రాజ్య క్షేమమునకు భంగము కలుగునని భావించుట వృథా భయ సంశయములకు తావిచ్చుటయే యగును.

రంగ: ఇంతమాత్రము చేతనే నేనట్లు భావించుటలేదు. ఈ మూడు సంవత్సరములనుండి కలుగుచున్న గృహచ్ఛిద్రముల స్వరూపము మీకు పూర్తిగా గోచరింపక పోవచ్చును. రానురాను కొండమదేవి సత్యభామా దర్పమున సామ్రాజ్య వ్యవహారములలో జోక్యము కల్గించుకొన జొచ్చినది. కైక దశరథునివలె ఆమె మహారాజును శాసించు కొనినది. సామంతులకును మహారాజునకును వైమనస్యములు కల్పించినది. మఘురానగర సామంత ప్రభువగు ముద్దు వీరప్పనాయకుడును తెుంజీర మండలాధిపతియగు కృష్ణప్పనాయకుడును ఆమెకు వశులై ఆమె పుత్రునే మహారాజుగ చేయ సంకల్పించినారను వార్తలు చేరుచున్నవి. పోర్చుగల్ క్రైస్తవ మతాచార్యులతో మహారాజులకు నెలకొనిన సఖ్యము ఆమె మూలమున క్షీణింప జొచ్చినది. వేయేల! అవకాశ మేర్పడినపుడెల్ల రాచకార్యములయందు తానే ప్రవేశించి వానిని తన కనుకూలముగా త్రిప్పుకొనుచున్నది. ఆమెయు, సోదరుడు జగ్గరాజును ఏకమై మహారాజునే లెక్కింపక యున్నారని చెప్పవచ్చును. ఈ పరిస్థితులలో సామ్రాజ్య క్షేమమును మనస్సులో నుంచుకొని మనము మెదలగుట మంచిదని నా అభిప్రాయము.

యాచమ: యువరాజా! ఇవన్నియు మాకును కొంతవఱకు వినబడిన వార్తలే. ఇద్దరు సామంతులు ఆమె పక్షము

వహించినారనియు, క్రైస్తవ మతాచార్యులు ఆమెకు వంగి వంగి నమస్కారములు చేయుచున్నారనియు మనము ఆతురత చెందవలసిన పనిలేదు. మహారాజు కొండమాంబా దేవికి పూర్తిగా వశుడై యామె చెప్పినట్లు చేయుచున్నాడనుట నిక్కమే. నాకు బాగుగా తెలియును. కాని ఈ బాలుని పట్టాభిషిక్తునిగా జేయుట ఎంతమాత్రము ఆయనకు ఇష్టములేదు. అట్లు జరిగి నచో ఆ మహారాజునకు కష్టముగూడ గలుగ గలదు. ఈవిషయమునే నిన్న మాకు స్పష్టముగా అసందిగ్ధముగా జెప్పినారు. అంతఃకలహములు కలుగునని భయపడి రాజవంశము వారికీ అన్యాయమ్ము చేయ నగునా?

రఘు : రంగరాయా! యాచమనాయుడు చెప్పినది పరమ సత్యము. ఇందులకు అన్యథా జరుగరాదు. రేపు నీవు పట్టాభిషిక్తుడవగుట నిశ్చయము. నీవు చెప్పు పరిస్థితులు కొంతవరకు ఆందోళనమునే కలిగించుచుండు గాక! భయపడవలసిన పరిస్థితులు ఏమియు లేవు. తుండీరమండలాధిపతి మొదటినుండియు రాజవంశము వారితో విరోధము వహించుచునే యున్నాడు. ఇపుడందు క్రొత్తయేమియు లేదు. ఈతడు పూర్వము సామ్రాజ్య ద్రోహియై ప్రవర్తించెను. వేంకటపతి రాయలీతనిని పెనుగొండ నగరమున చెఱబెట్టి యుంచెను. అపుడు నేనే కల్పించుకొని ఆతనికి బంధవిముక్తి

చేయించితిని. ఆత డిపుడు ముందు వెనుక లుకలియజూడక ఇంతవాడైనాడు. కానిండు. ఆతని పుట్టుపూర్వోత్తరములన్నియు నాకు తెలియును. ఆతని బంధవిముక్తి జరిగినపుడు కృతజ్ఞతాపూర్వకముగ నన్ను అల్లుని చేసికొనినాడు. ఇపుడును స్వగుణమును మాన లేక నావిరోధియగు మస్కురనాయకునితోజేరి, మహారాజులుంగారిని సాధింప జూచుచున్నాడు. ఇందు వ్యక్తి విరోధములు, సహజస్వభావములు బయలువడుచున్నవి. అందువల్ల మన కెట్టి యపకృతి జరుగబోదు.

రంగి: సామ్రాజ్య క్షేమమునకు భంగముకలుగనిచో నాకు మాత్రనేమి ఆక్షేపముకలదు! అయినను నామనస్సు ఏలకో కీడునే శంకించుచున్నది. విధివిధానమెట్లున్నదో! విధాతవ్రాత మీఱరానిది గదా!

---

## 3. వీర వేంకటపతిరాయలు

"కాన బుధసన్నుతినిగన్న యారవీటి వేంకటపతిరాయవిభునినితర
మనుజనాథుల రీతిని వినుతిచేయ నలవియే యాఘునుండు శేషలుడె తలప"

—రామరాజీయము.

శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీర వేంకటపతి దేవ మహారాజులవారు రాయవేలూరు ముఖ్యపట్టణముగావిజయనగరసామ్రాజ్యమును పరిపాలించుచుండెను. నగరదుర్గము మిక్కిలి బలిష్ఠమై శత్రునిర్భేద్యమై యుండెను. ఆ మహారాజు 1586 మొదలుకొని 1592 వఱకు పెను

గొండయు, 1592 మొదలు 1606 వఱకు చంద్రగిరియు, 1606 మొదలుకొని 1614 వఱకు వేలూరును రాజధానులుగా జేసికొని విజయనగర మహాసామ్రాజ్యమును పేరుప్రతిష్ఠలతో పరిపాలన చేయుచుండెను.

ఆ మహారాజు రాయవేలూరును ముఖ్యపట్టణముగా జేసికొని నాటికి ఏడుసంవత్సరములు దాటినది. పెనుగొండ నుండి చంద్రగిరిని రాజధానీ నగరముగ మార్చుటకు, సింహాసన మధిష్ఠించుటకు పూర్వమాతడు చంద్రగిరి యందు చిరకాలము రాజప్రతినిధిగ నుండుటంజేసి కలిగిన యభిమానమే కారణము కావచ్చును. రాయవేలూరును రాజధానీ నగరముగ మార్చు టకు ఒక విచిత్రసంఘటన కారణము. 1603 సం. లింగమ నాయుడు విజయనగరాధికారమునకు లోబడి సామంత ప్రభు వుగా నుండెను. ఆతడు మిక్కిలి ఐశ్వర్యవంతుడు. దుర్గ దుర్భే ద్యతను చూచుకొనియో, ఐశ్వర్యగర్వముననో ఆతడు స్వతంత్రరీతిని ప్రవర్తింపజొచ్చెను. ఆవిషయము వేంకటపతి దేవునకు చారులవలన దెలిసినది. చెన్నమనాయకుడు అను సేనానినిపంపి కోటనుజయించి దుర్గముయొక్క దుర్గమత్వమును గమనించి ఆశ్చర్యముచెంది మహారాజు వేలూరునే ముఖ్య పట్టణముగా జేసికొనెను.

తాళికోట యుద్ధానంతరము విజయనగర సామ్రాజ్య లక్ష్మి చెన్నుదఱిగియున్నపుడు లోని సామంతరాజుల తిరుగు బాటులను సవరించి, వెలుపలి తురుష్కుల దాడులను అడ్డు

కొని, సామ్రాజ్యలక్ష్మినిసి మరల నవ్వింపజేయ గలిగిన ధీర రసికాగ్రశిరోమణి వేంకటపతిరాయలే.

అనాటి కాలమున యువకులు—ముఖ్యముగా రాజయువకులు - పరిశ్రమలు చేయుటకు వ్యాయామ శాలలుండెడివి; దేహమునకు బలసౌష్ఠవమును సమకూర్చి యోధులనుతయారు చేయుటయే ఆసాముకూటముల లక్ష్యమై యుండెను. ♦ వీని మూలమున డెబ్బది యేండ్లవయసుగల ముసలివారు సహితము ముప్పదిసంవత్సరముల యువకులవలె విజృంభింపగలిగియుండిరి. సామ్రాజ్యమంతయు ఆంధ్ర, అరవ, కర్ణాటక దేశములుగా విభాగింపబడియె. పెనుగొండ ఆంధ్రదేశమునకును, చంద్రగిరి అరవదేశమునకును, శ్రీరంగపట్టణము కర్ణాటకదేశమునకును ముఖ్యపట్టణములుగా నుండెడివి. సామంతప్రభువులు పరిపాలనము సాగించుచు నియమిత కాలములయందు కప్పములు చెల్లించుచుండెడివారు.

సామ్రాజ్య పరిపాలనా సందర్భమున సలహాలొసంగుటకును కర్తవ్య నిరూపణము చేయుటకునుమంత్రివర్గముండెడిది.

రాజవంశ గురువగు తాతాచార్యుడును, మట్ల అనంతుడును, తరిగోపుల దత్తమంత్రియు, పెమ్మసాని పెద్ద తిమ్మరాజును, వేంకటపతి దేవుని యమాత్య వర్గములోని వారు. సైన్యాధిపతి గొబ్బూరి ఓబరాజు. ఈతడు జగ్గరాజు తండ్రి.

వేంకటపతి గొప్ప వైష్ణవ భక్తుడు. ఆతడు పుణ్యక్షేత్రములలో చేసిన దానములు అనంతములై యున్నవి.

---

♦ ఫాదర్ హ్యూరిక్ స్వదేశమునకు వ్రాసిన లేఖలో.

ఈ మహారాజు సింహాసన మధిష్ఠించిన తోడనే గోల కొండ సుల్తాను ఉత్తర పొలిమేరదాటి పెనుగొండను ముట్ట డించెను. అప్పటికి పదునాగు సంవత్సరముల వయస్సుగల తంజావూరు ప్రభు పుత్రుడు రఘునాధరాయలు మొదలగు వారు సాహాయ్యులుగా మహారాజు సుల్తానును కృష్ణానదిని దాటువఱకు వెన్నంటి తఱిమి కొట్టెను. ఈ మహాజయమే ఆతని కీర్తికి ముఖ్య కారణమైనది.

ఈమహారాజుకాలమున దేశదేశములనుండి రాయ బారులు వచ్చుచుండెడివారు. మొగల్ చక్రవర్తి అగ్బరు 1600 సంవత్సరమున ఒక రాయబారిని పంపియుండెను. నాలుగు గొప్పజాతి గుఱ్ఱములను మఱికొన్ని పారితోషికములను ఆ రాయబారి తెచ్చియుంచెను. మహారాజదర్శనమునకై ఆరాయ బారి మూడువారములు వేచియుండవలసివచ్చినది.

యూరప్‌లోని పోర్చుగల్ దేశపురాజగు 'డాంఫిలిఫ్' కును వేంకటపతి దేవరాయలకును తఱచు ఉత్తరప్రత్యుత్తర ములు జరుగుచుండెడివి.

విజయనగర సామ్రాజ్యమునందు మొదటినుండియు వాఙ్మయాభివృద్ధి లలితకళగా రంజిల్లుచుండెడిది. మహారాజు గణితశాస్త్రమందును వేదాంతసాహిత్యములందును గొప్ప పండితుడు. ఆస్థానపండితులతో తఱచు వాదోపవాదములు సంస్కృతభాషలో జరుపుచుండువాడు. తెనాలి రామలింగడు సహితము వేంకటపతి యాస్థానమును అలంకరించియుండెను. సంస్థానమున ఆంధ్ర ద్రవిడ పండిత కవీంద్రులు పెక్కురుండెడి

వారు. అధికారులుకూడ కవులు కవిపోషకులై యుండుట సంస్థానమున విచిత్రమైన విశేషము.

మధురయందు 'సంగ' మను పేరుతో విద్యాపరిషత్తు ఒకటి యుండెడిది. వందలకొలది విద్యార్థులచటి కరుదెంచుచుండెడివారు. ఈవిద్యార్థులకు ఆచార్యులకు భోజనాది యెల్ల సౌకర్యములు ప్రభుత్వమే చేయుచుండెడిది. విశేషమేమన ఆచార్యులను నియమించువారు అధికారులుగారు; మఱివిద్యార్థులే. అప్పటి కళాశాలలయందు తర్క వేదాంత న్యాయశాస్త్రములు ముఖ్యముగా బోధింపబడుచుండెడివి.

ఈమహారాజు సామ్రాజ్యమును పరిపాలించిన ఇరువది తొమ్మిది సంవత్సరములు చేతిపనులు, వ్యవసాయము, వర్తక వ్యాపారములు మిగుల అభివృద్ధిగో నుండెను. దేశము సుభిక్షముగా నుండెను.

ఈమహారాజు సంతానరహితుడు. సంతానాపేక్ష మిక్కుటముగా నుండెడిది. ఆ విచారముచే నాతడు ఆరోగ్యమును గూడ కోల్పోవలసివచ్చెను. అదియుంగాక గృహచ్ఛిద్రములు కూడ కలుగనారంభించెను. ఈవిషాద పరిస్థితులలో మనకథ ప్రారంభమగుచున్నది.

శ్రీ వీరవేంకటపతి మహారాజులు ఆరవీటి వంశపు మూడవ ప్రభువు. అళియ రామరాయలసోదరుడు. తిరుమలరాయుడు పెనుగొండరాజధానిగా కొంతకాలముపరిపాలించెను. తిరుమలరాయని తరువాత శ్రీరంగరాయలును,తరువాత శ్రీవేంకటపతిరాయలును విజయనగరసామ్రాజ్యమును పరిపాలించిరి.

# 4. పట్టాభిషేకము

"ఆరామసేతుహిమవత్క్ష్మారమణీ రమణుడై జగంబు భరించెన్."

—భట్టుమూర్తి

"శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ వీర వేంకటపతిదేవ మహారాజులవారికి జయము జయము. ఆంధ్రకర్ణాట సామ్రాజ్యాధిపతులకు జయము-జయము" అని వందిమాగధ దౌవారిక స్తోత్రములు మిన్నుముట్టుచుండ పటహాకాహళధ్వనులు దిక్కులు పిక్కటిల్ల, వీణాది మంజుల వాద్యముల మధుర స్వరములు హృదయానందకరములై వెల్లి విరియుచుండ, రాజకుమారులు వజ్ర వైడూర్యఖచిత భూషణాలంకృతులై తరలి వచ్చుచుండ, వేంకటపతి మహారాజు సభాభిముఖముగా స్వారివచ్చుచుండెను. ఆయన యధిష్ఠించిన యా భద్రగజము పట్టు పుట్టములతోడను నానా విధములై చిత్రవిచిత్రములైన పక్షి యాకలతో అలంకరింపబడి యుండెను. అంబారిపైని యొరుగుదిండు బంగారు సరిగతో చిత్రింపబడి యుండెను.

పై భాగమున సామ్రాజ్య కేతనమెగురుచుండెను. ఒక ప్రక్క బంగారు నీటితో చిత్రింపబడిన సింహమును, మఱియొక ప్రక్క మత్స్యమును కేతనమున చిత్రింపబడి యుండెను. ఆయన కీర్తి ప్రతాపములు భూమియందేగాక సముద్రము నందును వ్యాపించియుండె ననుటను కేతన చిత్రములు సూచించును. పుణ్యస్త్రీలు సౌధాగ్రమునుండి పూలవాన కురియించుచుండిరి. బారులుతీఱి యిరుప్రక్కల నిల్చియున్న ప్రజలపై మహారాజు కృపాకటాక్ష వీక్షణములు వెదజల్లుచుండెను.

మహారాజు నిండు పేరోలగంబు ప్రవేశించి నవరత్న స్థగిత సింహాసనమున సుఖాసీనుడయ్యెను. మంత్రి సామంత ప్రభువరేణ్యులు ఉచితాసనంబుల సుఖాసీనులైరి.

సభా భవనమంతయు నిశ్శబ్దముగా నుండెను. సూర్య భగవానుడు మేఘ సంఛన్నుడై తన దివ్య స్వరూపమును మఱుగు పఱచుకొని యుండెను. అక్కడక్కడ అపుడపుడు మేఘ గంభీర నిస్వనములు మాత్రము వినవచ్చుచుండెను.

సభాస్తారుల నుద్దేశించి, మహారాజు ఇట్లనియె. మంత్రి సామంత విద్వత్కవీంద్రులారా! పుర ప్రముఖులారా! నేడొక మహాప్రయోజన మద్దించి నిండోలగము ఏర్పాటు చేయ బడినది. నాకా! వయస్సు చెల్లుచున్నది. ఆరోగ్యము చెడు చున్నది. భగవదిచ్ఛ ఎట్లున్నదో!'

మహారాజునకు హీనస్వరము పడుచుండెను. వచ్చు నాయాసమును ప్రయత్న పూర్వకముగా నరికట్టుకొనుచు మహారాజు "నాయనా! రంగరాయా! ఇటురమ్మా. నా సమీపమునకు రమ్మా." అనియె.

రంగరాయులు అల్లనలేచి మహారాజును సమీపించెను.

మహా : నాయనా! రంగరాయా! పూర్వము నీకు యువరాజ పట్టాభిషేకము చేసితిని. అప్పటి నీ స్వభావ మెంత నిర్మలమో ఇపుడును అంతే, అప్పటి నీ రాజభక్తి ఎట్టిదియో ఇపుడును అట్టిదియె. కాదు; అంతకంటె అతిశయించినదేమో! నీసుగుణములు, భక్తిప్రపత్తులు, శౌర్యసాహసములునాకునచ్చినవి. రాజవంశగురువులు

తాతాచార్యులవారు నిర్ణయించిన యీ శుభముహూర్తమున నిన్ను సామ్రాజ్య పట్టాభిషిక్తుని చేయుచున్నాను. రమ్ము. ఈ ముద్రితాంగుళీయకము తీసికొని రాజలాంఛనముగా వ్రేలధరింపుము.

ఎల్లరును లేచి నిల్చుండి రాజాజ్ఞను గౌరవించిరి.

రంగరాయలు : (చేతులు జోడించి) మహారాజా! ఇంతవఱకెప్పుడును మీయాజ్ఞలను అన్యథాకరింపలేదు. ఇపుడేలకో! నాహృదయము జంకుచున్నది జారిన ఈమహాసామ్రాజ్యగౌరవమును చక్కబఱచిన మహాసామ్రాట్టులుమీరు: మీకు నేను చెప్పగలిగిన దేమియు లేదు. ఈ మహాసామ్రాజ్యగౌరవము ఇట్లేఖండఖండాంతరములు వ్యాపించుచుండుగాక. అంతకంటె నాకెట్టి వాంఛయు లేదు. నా మహారాజపదవిని బుద్ధిపూర్వకముగా విసర్జించుచున్నాను. అర్హులైనవారి కది యొసంగుడు. సామాన్యపౌరుడుగా నేను బ్రతుకగలను. సామ్రాజ్యక్షేమమున కెట్టి భంగమువాటిల్లకుండుగాక. "శ్రీమహారాజులవారికి జయమగుగాక."

మహారాజులు ఇంచుక సేపు నిమీలితనేత్రులైరి. సభాస్తారులందఱు అద్భుతాశ్చర్యములతో రంగరాయలను తిలకించుచుండిరి. అపరభీష్ముడువోలె చిత్రప్రతిమవలె రంగరాయలు నిల్చుండియుండెను. అప్పటి మహానిశ్శబ్దతను భంగపఱుప ఎవరును సాహసింపలేకుండిరి.

మహారాజు : (ఆనందబాష్పములు తుడిచికొనుచు) నాయనా!

నీవు నా సోదరపుత్రుడవుగాక సొంతపుత్రుడవేయైనను ఇంతకంటె నన్ను ఆకర్షింపజాలవు; ప్రేమపాత్రుడవు కాజాలవు. ఈ మహాసామ్రాజ్యమును పరిపాలింప నీకంటె అర్హులెవరు కలరు? సామ్రాజ్య క్షేమము నీబాహుపంజరములయందు సుస్థిర యశోవిరాజితమై యుండెగలదు.

రంగరాయలు తలవంచి నిరుత్తరుడై నిల్చుండెను.

మహారాజు : రంగరాయా! ఆలస్యము చేయవలదు. అభ్యంతరము చెప్పవలదు. నాకు ఎల్లవిషయములు తెలియును రమ్ము. వచ్చి ఈ యుంగరమును స్వీకరింపుము.

అనుచు మహారాజు తనకుడిచేయి చాచెను. రంగరాయలింకను వెనుకముందాడుచుండెను.

వెలుగోటి యాచమనాయడు లేచి రంగరాజును సమీపించి మహారాజులవారి యాజ్ఞను ఎన్నడైన మితిమీఱితిమా? ఇప్పుడీ ఆలోచనలేల?

అనుచు రంగరాయల చేయిఎత్తి చాచియున్న మహారాజులవారి చేతితో సంధించిరి.

సార్వభౌముడు రంగరాయల ప్రేలను ఉంగరము తొడిగెను. రంగరాయల కంటివెంట ఎకధారగా నీరుకారుచుండెను. బయటి కారుమేఘములును భీకరముగా గర్జించుచు వర్షింప సాగినవి. సభాస్తారుల జయ ధ్వానములు భీకర మేఘగర్జనలను పరిహాసించుచుండెను. వర్షధారలతో రంగరాయల కన్నీరు వియ్యమంద గలదా! లేదులేదు. రంగరాయని కన్నీరు ఆగి

పోయెను. వర్షధారలింకను అతిశయించుచుండెను. రంగ రాయలు ఉంగరమును తీసి కన్నులకద్దుకొని శిరమునధరించి,

"మహాప్రభూ! మీయాజ్ఞనుమీఅజాలను. సామ్రాజ్య గౌరవమును యథాశక్తిగా కాపాడుచుందునని ఇదిగో ఈ సభాస్తారుల యెదుట ప్రమాణము చేయుచున్నాను. మహారాజుల వారికి జయమగుగాక."

పేరోలగమంతయు ఒక్కమాఱుగా జయధ్వాన ముఖరిత మయ్యెను. అమ్మహాధ్వాన తర్జన గర్జనమ్ము నంజేసియా యేమి? అనునటుల మేఘగర్జలును నిశ్శబ్దత నంగీకరించెను. గగన పథమంతయు తేజస్వంతమయ్యె. లోకబాంధవుని ప్రియ దర్శనముచే ప్రకృతిదేవి యొడలు పులకరించినది.

మహారాజు చేయిచాచి రంగరాయలను ఆహ్వానించి అర్ధసింహాసనాసీనుని జేసెను. అపుడా యిరువుర మహారాజుల నేత్రములనుండి ఆనందబాష్పములు రాలుచుండెను. తమ్మ దామెఱుగకయే సభాస్తారులును జయఘోషలు చేసిరి.

# 5. దురాలోచన

"ముగురంగూర్చిన 'మూర్ఖ' దైవమునకుఁ మోమోటలే దింతయుఁ"

—శ్రీనాథుడు.

అది ప్రాతఃకాలము. బాలభానుని అరుణరేఖలు ఎల్ల యెడల నలుముకొనుచు జడప్రకృతిని చైతన్యధారా పునరు జ్జీవితను జేయుచుండెను. ప్రళయకావేరిపుర బాహ్యోద్యాన వనమున బాటసారి యొకండు ఏకాంతవిహారము చేయుచుం

డెను. బాలభాస్కరుని స్వర్ణకాంతులుగాని, విహంగముల కిలకిలా రావములుగాని, సద్యోవికసిత పుష్పపరీమళ సందోహములుగాని, పిల్లతెమ్మెరల సుఖస్పర్శలుగాని ఆతని నంతగా నాకర్షింపజాలకపోయెనా? ఏమో - ఎవ్వరెఱుగుదురు! ఆతని వైఖరిచూచిన ఏదో దీర్ఘాలోచన చేయుచున్న వానివలె నగపడు చున్నాడు. క్రమక్రమముగా ఆతని కన్నులెఱ్ఱనైనవి. కనుబొమలు ముడివడినవి. అది దూరాలోచనమా? దురాలోచనమా? దూరాలోచనమేయగునో నాకోపవికార చిహ్నము లేల? మఱికొంత సేపటికి అప్రయత్నముగా నీమాట లాతని నోటనుండి వినవచ్చెను.

ఏమి! ఎంతటిమోసము! దీనికి ప్రతీకారమునే చేయ లేమా! సోదరిని చూచివత్తును. ఆమెకింకను ఈవార్త చెవి బడినదో లేదో! చూడవలయును. అందులకే యిట్టి హడావుడి ప్రయాణము చేయవలసి వచ్చినది.

అనుచు నాతడు ఉద్యానవనమును వీడి వెడ వెడ నంతఃపురమార్గమును బట్టెను.

ప్రళయకావేరి మహారాజ్ఞియగు కొండమదేవి అత్యంత సుందరాంగి యనియే చెప్పవచ్చును. కానిమూర్తియందు సౌమ్యముకంటె దర్పమె ఎక్కువ. అందమునందు ఆకర్షణకంటె భీకరతయె ఎక్కువ. మేడలోని యంతఃపురమున రత్నకంబళముపై ఆమెకూర్చుండియుండెను. సమీపమున నేమాకరాజుఅను మండలాధిపతి గోడనానుకొని నిల్చుండియుండెను.

మాక : దేవి! నిజము. రంగరాయల పట్టాభిషేకము నిన్ననే

జరిగినదట. మహారాజులు స్వయముగా నాతని అర్ధ
సింహాసనమున కూర్చుండ బెట్టికొనిరట.

రాణి : మంచిది. అర్ధసింహాసనమున గానిచో నిండుసింహాసన
మున నే గూర్చుండబెట్టు కొననిమ్ము. ఇందులకే
కాబోలు నన్ని పట్టణమునకు తరిమి వేయుట! ఇందులకే
కాబోలు నన్ని పురమునకు రాజ్ఞిని జేసినది! ఇందులకే
కాబోలు నాపుత్రుని ప్రేమించువానివలె నటించినది!
ఒకదాసి ప్రవేసించి "తల్లీ! సోదరుడు జగ్గరాయలు
వచ్చుచున్నారు" అని చెప్పిపోయెను.

వెంటనే జగ్గరాయలు ప్రవేశించి గొండమాదేవి సమ
క్షమున ఆసీనుడయ్యెను.

మాకరాజు: దూరప్రయాణముచేసి వచ్చుచున్నట్లున్నది.

జగ్గ : సెంటుధోమమునుండి వచ్చుచున్నాను. ఎంత మోసము
జరిగినదో వింటివా!

కొండ : ఇపుడు వినుటయేమి! మూడుసంవత్సరముల క్రిందనే
వింటిని. కాని గ్రహింపలేకపోతిని. ఈ మూడుసంవత్స
రములనుండి మహారాజు ఎప్పుడైనను నామాట జవ
దాటెనా? మనస్సులోని సంకల్పమునే ఆకళింపుచేసి
కొని, నాకోర్కెల నెఱవేర్చుచుండెడివాడు. అది
నిష్కల్మపు ప్రేమ అనుకొంటిని. మోసపోతిని. ఈ
మూడు సంవత్సరములనుండి కండ్లున్న అంధురాల
నైతిని. మహారాజు కపటనాటక సూత్రధారుడని
ఇంచుకయైనను పోల్చుకొన లేకపోతిని.

జగ్గ : సోదరీ! గతజలసేతుబంధనము నిష్ప్రయోజనము. నిన్ను ప్రళయ కావేరికి, నన్ను సెంటుధోమునకు పరిపాలకులనుగా జేసి, మార్గము నిష్కంటకము చేసికొనినాడు. అంధలోకమది. ఆయనను మనము లోబరచుకొనినట్లుగా భావించినది. కలరూపు నేటికి బయటబడినది. పాపము! రంగరాయలు ఎంతదూరమో చెప్పినాడట. ఎన్ని అభ్యంతరములో చెప్పినాడట, మహారాజు దానిని పెడ చెవిని పెట్టినాడట.

మాత : నలదనుమ నలనల యేడ్చుచున్నను ఆతని వేలికి ఉంగరము పెట్టినదాక మహారాజు విడువలేదట.

కొండ : కానిమ్ము, నాకొడుకు ఎట్లు పట్టాభిషిక్తుడు గాలేడో చూచెద. తన సామ్రాజ్యమున నేను అండలేని, దిక్కులేని పక్షినని మహారాజు తలంచుచున్నాడు కాబోలు! సరియె. మహారాజు సవాలును అంగీకరించినాను. వంచనలకుమాత్రము అంతులేదా! వంచనకు ప్రతివంచనయను నాయుధముకలదని మహారాజునకు తెలియలేదు కాబోలు!

జగ్గ : మహారాజునకు తెలియనిదేమున్నది! కపటమే ఆయన విజ్ఞానము. సామ్రాజ్యమే ఆయన అహంకారము. రంగరాయలే ఆయన ప్రాణము. ఆలుబిడ్డ లేమైననేమి! ఆప్తుల యభిప్రాయము లెట్లున్ననేమి!

మాత : దేవీ, క్షమింపుము. ఇపుడు మనము కర్తవ్యమువిచారించుకొనవలయును. రంగరాయలు మహారాజుగా

పాదుకొనిపోయి సామంతుల నంద ఱను వశపఱచు కొనకముందే మనమాతని రాజ్యభ్రష్టుని చేయవల యును. ఈలోగా సామంతులను కొందఱనైనను మనము లోబఱచుకొనవలయును.

కొండ : మంచియాలోచనము. అయినను మన మీపనుల న్నియు వంచనచేతనే సాధించుటమంచిది. అవసర మగుచో యుద్ధమునకు వెనుదీయరాదు. యుద్ధము వలన సామ్రాజ్యము దెబ్బతినునేమో యని భయపడ వలసినపనిలేదు. సామ్రాజ్యము ఉన్న నేమి! ఊడిన నేమి! నాకొడుకుమాత్రము మహారాజు కావలసినదే.

జగ్గ : నేను నేడే బయలుదేఱి పోయెదను, తుండీరమండలాధి పతి, పాండ్యదేశాధిపతి మనపక్షమువారే. అదితథ్యము

మాక : అటువైపు వెలుగోటియాచమనాయుడు, రఘునాథ రాయలు చక్రరక్షకులుగానున్నారు. వారు యోధాను యోధులు. ప్రకృతము రంగరాయలు స్థానబలము గలవాడు. రాణిగారు సెలవిచ్చినట్లు వంచనచేతనే మనము వారిని సాధింపవలయును. అయినను యుద్ధ ప్రయత్నముల ఏమరుపాటు చెందరాదు. తప్పనిసరి యగుచో యుద్ధము తథ్యము.

కొండ : చక్కగా చెప్పుచున్నావు. మాకరాజుమార్గమే శ్రేయస్కరము.

దాసివచ్చి "తల్లీ! రాయవేలూరునుండి దూత వచ్చి

యున్నాడు." అని చెప్పి అంగీకారమును పొంది దూతను తీసి కొనివచ్చెను.

దూత : దేవీ, మహారాజులు మిక్కిలి అస్వస్థులై యున్నారు. వెంటనేవచ్చి చూచిపోవలసినదని శ్రీరంగరాయమహారాజు చెప్పిరమ్మనినారు.

కొండ : రంగరాయ మహారాజుగారా! సరియె. నీవుపొమ్ము. (దూత వెడలిపోవును)

జగ్గ : సోదరీ, నీవు రాయవెల్లూరికి పయనముకమ్ము. నేనును మాకరాజును మా పనులపై పోయెదము.



# 6. వీడ్కోలు

"చారుమాణిక్యభూషిత శస్తమస్తకంబయిన పన్నగముభయంకరముగాదె"

— భర్తృహరి

వేలూరి రాజభవనమున విశాల రమణీయమైన గది యందు రంగరాయ - రఘునాథరాయ - యాచమనాయకులు సుఖాసీనులై యుండిరి. కొంచెము దూరముగా రామదేవ రాయలు కూర్చుండి యుండెను.

రంగ : తండ్రిగారికి చాల ఎక్కువగా నున్నది. మీరేమో పోయెద మనుచున్నారు, వచ్చి చూచి పోవలసినదని పినతల్లి కొండమదేవికి కబురుచేసినాను.

యాచమ : మంచిపని చేసితివి. వారప్పుడే కుట్రలు మొదలు పెట్టినారని తెలియవచ్చుచున్నది. జగ్గరాజు తుండీర

మండల మార్గము పట్టెనని ఇప్పుడే కబురు వచ్చినది. రంగరాయ మహారాజా! మీరు చాల అప్రమత్తులై మెలగ వలసి యున్నది.

రంగ : జగ్గరాజ మాకరాజులును; కొండమయు మంతనము లాడుకొను చున్నట్లుగా ప్రళయకావేరినుండి వచ్చిన దూత చెప్పినాడు.

రఘు : మహారాజా! ఈవిషయములు విన్నమీదట ఇంకను తొందరగా పోవలసిన యవసరము కల్గుచున్నది. జగ్గరాజు తుండీరమండల మార్గాభి ముఖుడగుచో మాకరాజు మధురా నగరాభిముఖుడుగాక తప్పదు. ఇంకను ఎవరెవరు ఎచట నెచట ఏ మేమి కుట్రలు పన్ను చున్నారో! ఈ స్థితిలో అత్యంతము అస్వస్థత లోనున్న మహారాజులవారిని వీడిపోవుటకు మనస్సొప్ప కున్నది. అయినను ప్రయాణముతప్పనిసరియగుచున్నది.

యాచమ : ఇచటనుండుట మనకెవ్వరికిని క్షేమకరముగాదు. మహారాజులవారి అస్వస్థత-రంగరాయలవారి పట్టాభి షేకము-జగ్గరాజాదుల మోసము-ఇందు ఒకడొకడే సామ్రాజ్యమున అల్లకల్లోలము పుట్టించుటకు చాలి యున్నది. ఇపుడు ఈమూడును కలిసివచ్చినవి. ఏమి జరుగునో చెప్పవీలులేదు. మన మన దుర్గములకు మనము వెంటనే పోయి సమాయత్తులమై యుండ వలయును. ఎటుపోయి ఎటువచ్చునో; సేనలను సమ కూర్చుకొని సిద్ధపడి యుండవలయును.

రఘు : నాకు మఱియొక యూహకూడ గల్గుచున్నది. దూర దూర ప్రాంతముల నుండు సామంతులకు స్వీయపుత్ర సందర్భమున కొండమాదేవిగారు చేసిన తంతు గోచరము కాకుండ వచ్చును; రాజపుత్రునకు అన్యాయ్యము జరిగిన దనియు, రంగరాయలు మోసము చేసి నాడనియు వదంతులు వ్యాపింపజేసి జగ్గరాజాదులు పెక్కుమంది సామంతులను తమ వైపు త్రిప్పుకొనుటకు ప్రయత్నము చేయవచ్చును. మన మాప్రచారమును అరికట్ట వలసియున్నది. అందుచే మనము మన దేశముల కేగుట మిక్కిలి అవసరము. యాచమనాయా! నీ యభిప్రాయమేమి ?

యాచమ : మీ యూహ చాల సమంజసమైనది. అసలటులే జరుగునేమో! మనపై కత్తి కట్టుటయన్న సామాన్యముగాదు. వారెంత సేపటికి రఘునాధరాయలవారు చెప్పినట్లు కుట్రలు పన్ని తమ కార్యముల నెఱవేర్చుకొనజూతురు. ఎట్లైనను మనము వంచనమునకును, యుద్ధమునకును సిద్ధపడి ఎదురెత్తులు వేయుచుండవలయును.

రంగ : ఇంత గందర గోళము జరుగునని నేను ముందే యూహించితిని. మహారాజులవారు నామాట మన్నింపరైరి. మనలో మనము పోరాడు కొనుట సరిగాదు. వెలుపల మహమ్మదీయులు ఈ సామ్రాజ్యమును మ్రింగి వేయుటకు కాచుకొని యున్నారు. భగవంతు డేమి చేయ నున్నాడో!

యాచమ: మహారాజా! మీ యాలోచన సబబైనదికాదన లేము. మఱి రాజవంశ తంతువును త్రెంపి బ్రాహ్మణ బాలునకు రాజ్యము ధారవోయను లేము. ధర్మమార్గ మున మహారాజులవారి యాజ్ఞప్రకారము ప్రవర్తించు చున్నాము. "యతోధర్మస్తతోజయ" అని పెద్దలు చెప్పుదురుగదా!

రఘు: ఇక మనమాలస్యము చేయుటకు వీలులేదు. రంగ రాయసార్వభౌమా! ఇక మీరు పరమ జాగరూకులై ప్రవర్తించు చుండవలయును. ఈ దుర్గము అతిబలిష్ఠ మైనది. అంతంత మాత్రముగా శత్రువులు చొరలేరు. ఏమాత్రము ప్రమాదముకలుగ నున్నదని తెలిసినను మేమిరువురము మా సైన్యములతో వచ్చి వ్రాల గలము. ఇక మోసములు, కుట్రలు జరుగువిధానములే ఎక్కువగా నుండుననియే మాకు తోచుచున్నది. జాగ్రత్తగా మీరు మిమ్ముమలను కాపాడు కొను చుండుడు. మహామాత్యులను సంప్రతించనిదే ఎట్టి కార్యమునకు పూనుకొన వలదు.

యాచమ: సామంతులలో ప్రచారము చేయవలయును. సేనలను ప్రోగుచేయవలయును. మహాప్రభూ! ఇక మాకు సెలవు.

రంగ: మీరు పోవుచున్నారన్న హృదయమున చేయివెట్టి కలచినట్లున్నది. మిమ్ముల నాగుడనుటకుగాదు. తమరు వెళ్ళిరండు. త్వరలో పునర్దర్శనమగుగాక.

# 7. స్త్రీ హృదయము

"నీ సచ్చరితంబు భాగ్యమును సర్వము నేను ఫలించె కన్యకా"—పోతన

ఆ యువతీ యువకుల సమావేశమువలన నాటిసాయం కాలము ఉద్యానవనమునకె ఒక వింతసోయగము అబ్బినట్లున్నది. వారిసంభాషణములు పక్షుల కిలకిలారావములను గేలి చేయుచుండెను: వారి ముఖపద్మములు సరోవరాంబుజములను పరిహాసించుచుండెను. వారిరువురును మనకు పరిచయము గలవారే.

విజయ : యువరాజా! సెలవుతీసికొందును. మా తండ్రిగారు ప్రయాణమునకు సంసిద్ధు లగుచున్నారు.

రామ : అవును. నాకాసంగతి తెలియవచ్చినది. నన్ను "యువరాజా" అనిసంబోధించుచుంటివేల?

విజయ : రంగరాయలు మహారాజగుటవలన.

రామ : నాకింకను యువరాజపట్టాభిషేకము జరుగ లేదుగదా!

విజయ : రాత్రిని పగలు అనుసరింపదా!

రామ : రాజ్యమున అల్లకల్లోలములు చెలరేగు సూచనలు కానవచ్చుచున్నవి. మాతండ్రిగారి సార్వభౌమత్వము స్థిరపడిన తరువాతనన్ను నీయిష్టమువచ్చినట్లుసంబోధింపుము. ఇపుడట్లు సంబోధించుట పరిహాసము చేయుట మాత్రమే యగును.

విజయ: నేనిచటనుండుటయే విపర్యస్తముగనున్నది. ఇక నేను పలికినపలుకు పరిహాసముగాపరిణమించుటలో ఆశ్చర్యమేమున్నది?

రామ : విజయా! కోపమువచ్చినట్లున్నది. నీయిష్టమువచ్చినట్లు సంబోధింపుము.

విజయ : నాప్రతివచనము పరిహాసముగాగాని కోపముగాగాని పరిణామ మందవలసినదే కాబోలు!

రామ : లేదు. లేదు. ఇన్ని వ్యంగ్యార్థములు యెక్కడ నేర్చితివో!

విజయ : మాయాస్థాన కవీశ్వరుడు చేమకూరి వేంకటకవి. ప్రతిపదమున రసము లూరింపగలడు. పదముల విఱుపుచే అర్థముల భేదములచే శ్లేషములు ఒప్పింపగలడు. ఆ మహనీయుడు నా కవితాగురువు.

రామ : మంచిది. ఈమాఱు నీవు వచ్చునపుడు నీకావ్యముతోపాటు ఆయనను కూడ తీసికొనిరమ్ము.

విజయ : అనవసరముగాఆప్తులనిట్లునూనతపాల్చేయుటతగదు.

రామ : మఱల యేమి అపరాధము?

విజ : అవసరమున్నవారు కావలసినవారిని స్వయముగా వచ్చి చూచుట ధర్మము. ఆదరముతో చూడవచ్చినవారితో, నిన్ను జూచుటవలన నాకు తృప్తి లేకున్నది. వారిని వీరిని వెంటబెట్టుకొని రమ్ము, అనురీతులు ధ్వనించునట్లు ఆజ్ఞాపించుట సాహసము.

రామ : విజయా! నీతో మాటలాడుట మిగుల కష్టముగానున్నది. వేంకటకవిని జూచుటకు నేనే స్వయముగా రాగలను. ఇక నీరాక నాకు తృప్తిని గల్గించుట లేదను ధ్వని నా పలుకుల యందున్నట్లు భావించుచున్నావు.

అసలే కలత చెందియున్న మా తండ్రిగారి మనస్సు మీ తండ్రిగారి రాకవల్లను, నా మనస్సు నీ రాకను వల్లను, ఎంత శాంతి, ఎంత తృప్తినందియున్నవో. పోనీ భగవంతున కేని తెలియదా!

విజయ : రామదేవరాయా! క్షమింపుము. నా పరిహాస విజల్పితములను పరమార్థములుగా గ్రహింపకుము. మఱి నీవు తంజావూరు ఎపుడు వత్తువు-? వేంకటకవిని చూచుటకు మాత్రమే లెమ్ము—

రామ : (నవ్వుచు) చమత్కారము నీ సొమ్ము. ఇక నీకు వేఱు సొమ్ము లవసరము లేదనుకొందును. మా తండ్రిగారి పదవి స్థిరపడిన తరువాత, రాజ్యమున కట్టు దిట్టము లేర్పడిన యనంతరము ఈ బ్రాహ్మణబాలుని యార్థ సత్వ విషయము నిర్ణయమైన తదుపరి మీతంజావూరు రాగలను. వేంకటకవిని చూడగలను. అనుకూల పడుచో తమ దర్శనముకూడ చేసుకొనగలను.

విజయ : హిరణ్యాక్షు వరములకు గూడ ఒక మితి యుండవల యును. అది అట్లుండనిండు. మీరు మాత్రము చాల అప్రమత్తతతో మెలగవలయును. అవసరమగుచో వెంటనే తండ్రిగారికి కబురు చేయుడు. సైన్యము సమకూర్చిన యనంతరము తంజావూరు వత్తునని యాచమ నాయడు మా తండ్రిగారితో చెప్పుచుండగా వింటిని. ఆతనితో కలిసి మీరు రావచ్చుననుకొందును.

రామ : తప్పక వచ్చెదను.

విజయ: తొందరగా రమ్మని తండ్రిగారు చెప్పినారు. సెలవా మరి?

రామ : నేను వచ్చు చున్నాను. నీ వంగీకరించిన చో మన మిరువురము కలసియే పోవుదము.

విజయ : అంగీకరింప వలసినదిగాని, అనుజ్ఞ నీయవలసినదిగాని యువరాజులు, మహారాజులు. మా అంగీకార మెంత ? మా ఆజ్ఞ ఎంత ? మే మెంత ?

రామ : (నవ్వుచు) మఱల మనము మొదటి ఘట్టమునకే వచ్చుచున్నా మనుకొందును. ఎవరో వచ్చుచున్నారు.

దాసి ప్రవేశించి "విజయమ్మగారిని, యువరాజుల వారిని రఘునాధరాయ యాచమనాయకులు పిల్చుకొనిరమ్మను చున్నారు." అనియె.

# 8. ద్రోహము

"కృతఘ్నుని ఏనుగు గోతవుట్టక కబళింప పుక్కులు నొడంబడు నే కురుసంశ వర్గ నా" — తిక్కన

ఆదినము చాల దుర్దినము. ఆకాశమంతయు మేఘచ్ఛన్నమై యుండెను. భయంకరముగా ఉరుము చుండెను. లోక బాంధవుని దర్శనమే లేదు. కొండమదేవి ప్రళయకావేరి సౌధాంతరమున మూడేండ్ల కుమారునితో సల్లాపము లాడు చుండెను.

దాసి ప్రవేశించి "అమ్మా రాయవెల్లూరు నుండి తమ దర్శనార్థము ఎవరో వచ్చియున్నారు. అడిగినను పేరు

చెప్పదు. అమ్మగారిని అవసరముగా చూడవలయు నను చున్నాడు." అని చెప్పెను.

కొండ : తత్క్షణము తీసికొని రమ్ము.

ఆగంతుకుడు వచ్చి నమస్కరించును.

కొండ : ఎవరునీవు? ఏమిపనిమీద వచ్చితివి ?

ఆగం : తల్లీ! నేను రామసింగుగారి [illegible] బావమఱదిని. [illegible] వచ్చుచున్నాను.

కొండ : మంచిది. [illegible] సత్యసంధతకు రాజభక్తికి సంతసించితిమి. ఏమని [illegible] యిచ్చినాడా ?

ఆగం : లేదుతల్లీ ! కొన్నిమాటలు చెప్పుమనినాడు. సెలవైన చో చెప్పెదను.

కొండ : చెప్పవచ్చును.

ఆగం : మాబావగారైన రామసింగు తాను మీవాడనని యే చెప్పుమనినాడు. ఎప్పటి సంగతులు అప్పుడు కబురు చేయుమనియు, తమరన్న బహుమానము సంగతి జ్ఞప్తి చేయుమనియు చెప్పినాడు.

కొండ : ఇప్పటి వార్తలేమి ?

ఆగం : శ్రీ శ్రీ శ్రీ వెంకటపతిదేవ మహారాజులుంగారు గతించిన తరువాత ఎల్లరును శ్రీరంగదేవరాయలవారి పట్ల భక్తి ప్రపత్తులుచూపి సేవించుచున్నారు. శ్రీరంగ రాయలు ధర్మరాజనియే పేర్కొనబడుచున్నారు. ఈమధ్య వారికి శాస్త్రీయముగా మరల పట్టాభిషేకము జరిగినది,

దాసివచ్చి "దేవీ జగ్గరాజుగారు వచ్చుచున్నారు" అని చెప్పి వెడలిపోయెను.

అంతలో జగ్గరాజు ప్రవేశించెను. సుఖాసీనుడైన తరువాత ఆగంతుకుని ఉద్దేశించి "ఈతడెవ"రని సోదరిని అడిగెను. విషయమంతయు తెలిసికొని సంతోషించి, సరే తరువాత చెప్పుమనెను. ఆగంతుకుడు రాణిముఖమువంకజూచెను. చెప్ప వలసినదిగా కొండమదేవి ఆజ్ఞాపించెను.

ఆగంతుకుడు ఇట్లు చెప్పదొడంగెను.

తల్లీ! శ్రీవీరప్రతాప వీరవేంకటపతి మహారాజుల వారు చేసిన తాత్కాలిక పట్టాభిషేకమునకు ఎల్లసామంతులు వచ్చుట పడలేదను కారణమున మరల శ్రీరంగరాయులవారికి శాశ్వత పట్టాభిషేకము జరిగినది.

జగ్గ: ఔను. ఆసంగతి మాకు తెలియును. తరువాత—

ఆగం: అది మంత్రి పురోహిత సామ్రాజ్య మండలాధిపతు లయు, విద్వజ్జన బంధుజనులయు సమక్షమున జరిగినది. శ్రీ రంగరాయలు శ్రీ వీరవెంకటపతిదేవ మహారాజుల వారియొక్క గూఢులక్షల ♦ వజహావుల విలువగలిగిన చెవి వజ్రమును, రెండులక్షల విలువగలిగిన చెవి కమ్మలును, అమూల్యములైన రత్నాభరణములును ధరించి సింహాసనస్థుడై యుండెను. సామంత మండ లాధిపులెల్లరును వినయవినమితగాత్రులై కానుక లర్పించి

♦ ఒక నాణెము.

నమస్కరించి శ్రీరంగరాయలను సార్వభౌములుగా సంగీకరించిరి.

జగ్గ: ఆ పట్టాభిషేకమును దర్శింపని మండలాధిపతు లెవ్వరైన నున్నారా?

ఆగం: ఉన్నారు స్వామీ! వారినిగుఱించియే అపుడు చాల మంది పెక్కువిధములుగా ననుకొన్నారు.

జగ్గ: రానివారెవరు?

ఆగం: (జగ్గరాజునుద్దేశించి) తమరును, మాకరాజుగారును, రావెల వేంకటపతినాయడుగారును.

కొండ: సిరినుద్దేశించి ఏమనుకొనినారు?

ఆగం: కొండమాంబా మహారాజ్ఞీ, మహారాజులవారి చితిపై నెక్కిన మూవురు రాజ్ఞులతో బాటు సహగమనము చేయక వెడలిపోవుటయు, ఇప్పుడు జగ్గరాజుగారు పట్టాభిషేక మహోత్సవమును సందర్శింప రాకపోవుటయు మిక్కిలి ఆశ్చర్యకరములుగానున్నవి. ఇందు ఏదియో అంతరార్థముండితీఱును అని కొందఱును, అంతఃకలహములు సంభవింప వచ్చునని మఱికొందఱును తలకొక విధముగా చెప్పుకొనినారు.

అపుడు దాసిప్రవేశించి, తల్లీ! మండలాధిపతులు మాకరాజుగారును రావెల వేంకటపతినాయడుగారును వచ్చుచున్నారని చెప్పి, రాణిగారి ఆజ్ఞనుపొంది, వారిని తీసికొనివచ్చి; విడిచి వెళ్ళెను.

కొండ: మంచిసమయమున చనుదెంచినారు. అటుకూర్చుండుము.

జగ్గ : నీపే రేమంటివి ?

రణ : రణసింగు స్వామీ !

జగ్గ : రణసింగూ ? ఇంకేమేని విశేషములు గలవా ?

రణ : లేవుస్వామీ ! (అనుచు రాణివంకజూచెను)

కొండమాంబ లేచి అమూల్యాభరణములు గల యొక చిన్ని పేటికను తెచ్చి వానిచేతికిచ్చి దానిని దుర్గాధ్యక్షున కీయుమని చెప్పెను. రణసింగు దానిని కన్నులకద్దుకొని అచటి వారికి సమస్కరించి వెడలిపోవుచుండెను. రాణి వానిని పిలిచి "ఓయీ! విశేషములు పుట్టినపుడెల్ల నీవువచ్చివానిని మాకెఱింగించుచుండవలయును. దుర్గాధ్యక్షుని ఇంకను విశేషముగా సత్కరించెదను. కృతజ్ఞతాబుద్ధితో నుండవలసినదని తెలుపుము. నీవు తెలివిగల రాయబారివిగా నగపడుచున్నావు. విశేషములు వినిపించుటకు నీవేవచ్చుచుండుము. ఇదిగో నీవారి బత్తెమునకై ఈ హారమునుతీసికొమ్ము" అని మఱియొక ముత్యాలహారము తెచ్చి వానికిచ్చెను.

రణసింగు రాణికి సాష్టాంగపడి సంతోషించుచు వెడలి పోయెను.

వచ్చిన వేంకటపతి మాకరాజులు సంభాషణ పూర్తిగా వినకపోయినను సంగతులన్నియు గ్రహింప గల్గిరి.

# 9 నిశ్చయము

"తమకార్యంబు పరిత్యజించియు బరార్థప్రాపకుల్ సజ్జనుల్" — భర్తృహరి

పెనుమాడి మండలాధిపతియైన యాచమనాయుడు తన దుర్గమున ఒంటరిగా కూర్చుండి తీవ్రముగా నాలోచించుచుండెను. కొండమదేవి నడతలును, జగ్గరాజు కుట్రలును ఎప్పటికప్పుడు అతడు చారముఖమున సాధ్యమైనంతదనుక తెలిసికొనుచునే యుండెను. అతనిదగ్గర నాలుగువేల సైన్యముండెను. అందు వందమంది యువకులను ప్రత్యేకించి యొక పటాలముగా తయారుచేసెను. వారికి తెలియని యుద్ధరహస్యములు లేవు. గజయుద్ధమును, అశ్వయుద్ధమున వారికి ప్రత్యేక నైపుణ్యము గలదు. వారందరును కండలు మెలిదిరిగిన దోర్దండులు. పిరికితనము లేనివారు వారి నిలువెల్ల పరాక్రమమే యని చెప్పవచ్చును.

ఒక్క పరాక్రమముననే గాక చారులుగాగూడ వారు అఖండులు. వారి నాయకుడు రామానాయుడు. ఎదుటవచ్చి నిల్చుండిన రామానాయుని గమనింపకయే యాచమనాయుడు ఏదియో యాలోచనలో మునిగియుండెను.

రామానాయుడు (సమీపమునకరిగి) 'ప్రభూ' అని సంబోధించెను. యాచమనాయుడు అదరిపడిచూచి "రామానాయుడా ! ఎప్పుడువచ్చితివి" అని యడిగెను.

రామా : ఇపుడే ప్రభూ ! మీరు కబురు చేసితిరిగదా !

యాచమ : ఔను. నీవిపుడు ఉత్తమాశ్వమును అధిరోహించి రాయవేలూరు పోవలయును.

రామా : చిత్తము స్వామి.

"రామానాయా! నీవువెంటనే రాయవేలూరుపోయి శ్రీరంగరాయల మహారాజుగారితో నామాటలుగా దుర్గాధ్యక్షుని చర్యలు జాగరూకతగా కనిపెట్టియుండవలసినదిగా తెలియజేయుము. మఱియు జగ్గరాజు, మాకరాజు, రావెళ్ళ వేంకటపతి, కొండమాంబరాణితోగలిసి కుట్రలుబన్నుచున్నారనియు, పులికాట్టు ప్రళయకావేరి నందుగల ఒలందులను ఒత్తిడిపెట్టి తుపాకులు, మందు లోనగు సామానులు ప్రోగుచేయు చున్నారనియు తెలుపుము. కుట్రలు పన్నివచ్చి కోటను స్వాధీనము చేసికొనుటకుగాని అవసరమగుచో యుద్ధముచేసి కోటను స్వాధీనముచేసికొనుటకుగాని, అత్యంత ప్రయత్నము చేయుచున్నారనియు వచింపుము. యుద్ధసందర్భములు నాకును రఘునాథరాయలకును వదలి తాను తన శక్తినంతయు నుపయోగించి, కుట్రలను వేయికన్నులతో కనిపెట్టుచుండుమనియు వక్కాణింపుము. యుద్ధసందర్భములు విచారించుటకు తంజావూరు పోవుచుంటిననియు, లేనిచో స్వయముగా వచ్చి మాటలాడిపోయెడివాడనే యనియు మహారాజుతో వచింపుము. నేను దూరదేశస్థుడనై యుండు నీకాలములో ఎంతజాగ్రత్తగా నున్న అంత శ్రేయస్కరమని తెలుపుచు నావందనములు మహారాజులకు అందజేయుము. యువరాజువారికి గూడ ఈ విషయములు దెలియజెప్పుము" అని యాచమనాయడు చెప్పెను.

రామానాయడు యాచమనాయకునకు నమస్కరించి వెడలిపోయెను. వాలిన ఈగలు రాలిపోవు నుత్తమజాతి గుజ్జి

మును అధిరోహించి, అతడు రాయవేలూరు పురాభిముఖుడై వెడలిపోయెను.

యాచమనాయుడు పెద్దనిట్టూర్పువిడిచెను. ఆసమయమున దూరదేశమునకు పోవుటకు అతని మనస్సంగీకరించుట లేదు. సర్వవిషయములు రఘునాధరాయలవారికి నివేదించుకొనుటకును, సామంతులను తనపక్షమునకు త్రిప్పుకొనుటకును సేనల ప్రోగుచేయుటకును తాను వెళ్లుట తప్పనిసరియని తెల్పుకొనెను. ఇపుడాతడు ఏమిచేయగలడు? ముందుచూచిన గొయ్యి వెనుకచూచిన నుయ్యి. శ్రీరంగరాయలు దయాభిశోభితుడు. ధర్మబుద్ధిగలవాడు. కుట్రలు మోసములు ఆయనకు తెలియవు. స్వార్థమునువీడి సామ్రాజ్యమును రక్షించుటయందే ఆయన ఉత్సాహ పడుచుండును. అట్టివానిని జగ్గరాజు, మాకరాజు మొదలగువారి కెరకొగ్గి తాను దూరదేశమునకు వెళ్ళనగునా? మఱి యుద్ధమేసంభవించినచో సరియైన సేనలులేక తన నాల్గువేలసేనతో తాను చేయగలిగినదేమున్నది? ఇదియే యాతని యాలోచన. తుదకు వెళ్ళుటకే నిశ్చయించుకొనెను.

అప్పటికే యాతడు చాలమంది సామంతప్రభువులను చూచి తమపక్షమునకు త్రిప్పుకొనియున్నాడు. ఇంకను మఱికొందఱను చూడవలసియున్నది. ఇక నిపుడు వారలను చూచుట పడదు. రఘునాధరాయలను చూచి తరువాత ఆసంగతి విచారించుకొనవచ్చును, అని అతడు నిశ్చయించుకొనెను.

ఎన్నివిధములుగా చూచినను రఘునాధరాయలను తత్క్షణమే దర్శించుటయె కర్తవ్యముగా నాతనికి తోచుచుండెను.

వెంటనే యాతడు గుఱ్ఱము నధిరోహించి మెరియలవంటి యోధులను కొందఱను వెంటబెట్టుకొని తంజావూరు నగరాభిముఖుడై బయలుదేరెను.

—:o:—

# 10. అపూర్వలేఖ

"ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ"—సుమతీశతకము

ప్రళయకావేరియందలి రాజభవనమున కొండమదేవి, జగ్గరాజు, మాకరాజు, రావెల వేంకటపతి కూర్చుండి సమాలోచనలు సాగించుచుండిరి.

కొండమ: యాచమనాయుడు తంజావూరు పోయినాడట. మంచి సమయము లభించినది. యుద్ధముచేసి రాయవేలూరు కోటను స్వాధీనము చేసికొనుట కానిపని. ఇపుడు మనము వంచనచేతనే కోటను స్వాధీనము చేసికొనవలయునని సంకల్పించుకొంటిమి.

జగ్గరాజు: అదియే మేము మువ్వురము ఆలోచించుకొనియుంటిమి.

శ్రీరంగరాయలు వట్టి అమాయకుడు. అతనికి తెల్లనివన్నియు పాలు, నల్లనివన్నియు నీళ్లు. ఇపుడు మేమొక యుత్తరము శ్రీరంగరాయలకు పంప నిశ్చయించుకొంటిమి. ఇదిగో ఈకమ్మనుపరింపుము. అని జగ్గరాజు ఆమెచేతికి కమ్మనిచ్చెను.

కొండమ : (కమ్మ అందుకొని బిగ్గరాగా ఇట్లు చదివెను.)

"మద్రాజాధిరాజ శ్రీరాజపరమేశ్వర శ్రీరంగ రాయసార్వభౌములవారి పాదపద్మముల సన్నిధికి—

సాష్టాంగ నమస్కారములుచేసి సామంతులు జగ్గరాజు, మాకరాజు, రావెల వేంకటపతి వ్రాయు విన్నపములు —

ఇదివఱలోవచ్చి మీకు కానుకలు చెల్లించిమీదర్శనము చేసికొని [illegible] పోయినందులకు మేము మిక్కిలిచింతిల్లుచున్నాము.

మేము మీకు ప్రతికూలురమై ప్రవర్తించుచున్నామని వారును వీరును మీకు తెలిపినట్లుకూడ మాకు తెలియవచ్చినది. అవన్నియు వట్టి పుకారులు. తమరు వానిని నమ్మకుందురుగాక యని ప్రార్థన.

శ్రీ శ్రీ శ్రీ వీరవేంకటపతిదేవ మహారాజులవారు పరలోకగతులైనప్పటినుంచియు మహాసోదరి కొండమాంబ కూఁతు వానిమీఁది ప్రేమచే సహగమనము చేయజాలనైతినే యని మిగుల వగలం గుములుచున్నది. ఆమెనోదార్చుటకే మాపని సరిపోవుచున్నది.

తమరు తమ సహజదయార్ద్రచిత్తముతో మాకు అనుజ్ఞ దయచేసినయెడల దేవరసన్నిధికి విచ్చేసి కానుకలర్పించి, మా రాజభక్తిని వెల్లడింపగలము. మా ప్రణామము లర్పింపగలము. వినయ విధేయతలతో సంచరింపగలము.

దివ్యచిత్తమునకు సేవలయును.

ఇట్లు,
తమభృత్యానుభృత్యులు
జగ్గరాజు
మాకరాజు
రావెల వేంకటపతి

ఈ యుత్తరము చాల అద్భుతముగా నున్నది. మనము వెంటనే దీనిని పంపుదము.

జగ్గరాజు అప్పుడొక భటునిపిలిచి వానిచేతికా యుత్తరము నిచ్చి రాయవేలూరిలోని శ్రీరంగరాయ మహారాజులుంగారికీ ఈయవలయునని ఆజ్ఞయిచ్చెను. ఆదూతయు కమ్మను గ్రహించి వెంటనే బయలుదేరి పోయెను. తోడ్తో ఒకదాసి వచ్చి తమ దర్శనమునకు క్రైస్తవ మతాధికారివచ్చి వేచియున్నాడని చెప్పి రాణీగారి యనుజ్ఞపొంది తీసికొనివచ్చెను.

క్రై. మ : (రాణిగారికి వంగివంగి నమస్కారము లాచరించి) తుపాకిమందును, తుపాకులును వానిని ప్రయోగింపగల భటులను సంతరించి యుంచితిని. తమ యాజ్ఞ అయిన-చో ఇపుడే తెప్పింపగలను.

కొండ : వెంటనే తెప్పింపుము.

క్రైస్తవమతాధికారి బయటనిల్చుండిన బంటును పిలిచి వానిని తే నియమించెను. వాడును శీఘ్రమేపోయి ఒకబండిపై వాని నన్నింటిని వేయించి దెచ్చెను. వానిని ప్రయోగింపగల భటులును అయిదారుగురు వచ్చిరి.

జగ్గరాజు క్రైస్తవమతాధికారియొద్దకు బోయి తుపాకి మందుతో కోటగోడలను బ్రద్దలుచేయు విధానమును యుద్ధము నందు దానిని ఉపయోగించి సైన్యమును నాశనముచేయు విధానమును ఇంకను ఇతర రహస్యములను స్వయముగా పరిశీలనా దృష్టితో గుర్తెరింగి, క్రైస్తవ మతాచార్యుని బహూకరించి పంపివేసెను.

పోవునట్టి క్రైస్తవమతాధికారిని మరల పిలిపించి కొండ మాంబ ఇట్లు చెప్పెను.

మీ రాజభక్తికి, ప్రావీణ్యమునకు సంతసించితిని. మీ యొద్ద తుపాకియుద్ధము చక్కగా చేయగల యోధులును గలరని వింటిని. అట్టివారి పటాలము నొకదానిని మాకొఱకై మీరు తయారుచేసి యుంచవలసినది. అవసరమగుచో ఆపటాలమును మేము యుద్ధమున వాడుకొనదలచితిమి. ఇప్పటినుండియు ఆపటాలముల ఖర్చులన్నియు మేమే భరించెదము. ఇందులకుగాను మిమ్ములను అత్యధికముగా బహూకరింపగలము.

క్రైస్తవమతాధికారి : (నమస్కరించి) సాధారణముగా ఇట్టి సాయములు మేము ఏ పక్షమునకు చేయరాదని మా పైవారు ఆజ్ఞాపించియున్నారు. ఇటుచేయుచో ఒకప్పుడు మా వర్తకవ్యాపారములకు నష్టము కలుగవచ్చును. మా సాయమందని పక్షము గెలిచినచో మా ప్రాణములే ఎగిరిపోవచ్చును. తల్లీ నీవు మారాజ్ఞమణివి. కావున మనవిచేసుకొనుచున్నాను. నన్ను క్షమింపుము.

కొండ : ఓయీ! మతాధికారీ, నీకెట్టిఆపదయు కలుగబోదు. నీవు మాయాజ్ఞ నెఱవేర్పుము.

క్రై. మ : (గడగడలాడుచు) చిత్తము. (అని వెడలిపోయెను.)

# 11. ప్రతిజ్ఞలు

"సజ్జనులు కారె పరహితాచరణమతులు" — భర్తృహరి

తంజాపూరుపురము మిక్కిలి అందమైనది. కావేరీ మహానదీ మధురజలధారలచే ఆ క్షేత్రము సుక్షేత్రమై సర్వకాల సర్వావస్థలయందు సుభిక్షమై తనరారుచుండును. అందలి మనోహరములైన యుద్యానవనములు సుందరమందిరములు విశాలమైన రాజవీధులు స్నేహపాత్రులైన ప్రజలు చూపఱకు సదా కనువిందు చేయుచుందురు.

తంజావూరు రాజసౌధమునందు రఘునాథరాయలును యాచమనాయడును సుఖాసీనులై సంభాషించుకొనుచుండిరి.

యాచమ : అయ్యా! పరిస్థితులు గంభీరగోచరముగా నున్నవి. రాయవేలూరు మధ్యాహ్నసమయమున జగ్గరాజప్రభృతులు మంతనములాడుచున్నట్లు నాకు సూచనగా తెలియవచ్చినది. అందుచే నేనిచటికి వచ్చునప్పుడు నామనస్సు మనస్సులో లేదు. మహారాజుగారికిని యువరాజుగారికిని జాగ్రత్తగా నుండునట్లు కబురుచేసి ఇచటికి వచ్చితిని.

రఘు : మంచిపనిచేసితివి. ఈ ప్రాంతమునందలి సామంతులతో నేను మాటలాడితిని. మొత్తముపై రాజకుమారుని బ్రాహ్మణబాలుని సంగతి చాలమందికి తెలియదు. రంగరాయలు వేంకటపతిరాయలు కలసి రాజకుమారునకు ద్రోహము చేసినారనియే నమ్ముచున్నారు. దీనికి తోడుగ తుండీరమండలాధిపతియగు కృష్ణప్పనాయుడును పాండ్యమండలాధిపతియగు వీరప్పనాయుడును జగ్గరాజు

తరస్పర అతి ప్రచారము చేయుచున్నారు. అయినను మనము నిరాశపడవలసిన పనిలేదు.

యాచన: ఉత్తర దేశమున పరిస్థితులు లంమలకు భిన్నముగా నున్నవి. ఉత్తర దేశమున ఏ ఒకరో ఇరువురో తప్ప మాండలాధిపతులెల్లరు మన పక్షమువారే. దక్షిణ దేశమున మనకంతగా అనుకూలత లేదని మీమాటల వలన స్పష్టపడుచున్నది. అయినను ఒక్క సందేహము నన్ను బాధించుచున్నది. కృష్ణప్పనాయుడు మీకు పిల్ల నిచ్చిన మామగారుగదా! వానిని మనవైపు త్రిప్పు కొనుటకు ఎట్టి మార్గములును లేవా?

రఘు: లేవు లేవు అతడు వట్టి ధూర్తుడు, కృతఘ్నుడు. శ్రీ వీర వేంకటపతిరాయల రాజ్య ప్రారంభదశయందు కృష్ణప్పనాయుడు స్వామిద్రోహియై ప్రవర్తించుటంజేసి పెనుగొండ నగరమున చెరపెట్టబడియె. అపుడు నేను రాయలవారికి విన్నవించి, అతని చెరనుండి విడిపించితిని. ఆవిశ్వాసముచే నాతడు తనకుమార్తెను నాకిచ్చి పెండ్లిచేసెను. అయినను అప్పటినుండియు అరకొరమాటలేగాని నాతో మనసిచ్చి మాటలాడి యెఱుగడు. ఇపుడు పూర్తిగా విముఖుడైనాడు. పామునకు పాలుపోసి పెంచినను తన సహజగుణము మాన గలదా? ఈమధ్య ఆయనకూతురునుగూడ బంపి చూచినాను. అవమానముతప్ప మరెట్టిఫలితము కలుగలేదు.

యాచమ : ఆతని సంగతి తెలిసికొని నవ్వులేలచేసితిరి? సరియె. కానిండు. నాకుమూడ జగ్గిరాజు ప్రచారము చాల తీవ్రముగా నున్నది. ఆయనకు తోడుగా మాకరాజు గావెల వేంకటపతిరాజు చేరినారు. వారు అల్లులు. అల్పరాజ్యలక్ష్మీ మదాంధులు. ఇంకనేమి? అగ్నికి వాయువు తోడుపడినట్లు అయినది.

రఘు : ఏమియు నిరాశ చెందవలదు. పాండవులసేన ఎంత? కౌరవులసేన ఎంత? ధర్మపక్షమే విజయమందితీరునని నా యభిప్రాయము.

యాచమ : భగవానుని యనుగ్రహము కల్గియుండుగాక! ప్రబలులైన తురుష్కమూకల పాండ్యమండల గ్రామపతుల ప్రాపుగల్గి యుండుటచే ఈ అంతఃకలహములకు సంబంధించిన మహావిప్లవము దక్షిణప్రాంతముననే యుద్ధరూపమున పరిణమింపగలదని నా యభిప్రాయము. ఉత్తరదిక్కున మనపక్ష మెక్కువగా నున్నమాట వాస్తవమే కాని అచటనుండి దక్షిణదిక్కునకు సైన్యములు తరలి వచ్చుట కష్టసాధ్యము.

రఘు : నీవు చెప్పినది వాస్తవము. దక్షిణభాగమున యుద్ధము జరుగుట మనకును ఒక విధముగా మంచిదే. నాసేనలు మిగుల చాపున నుండును. వారివ్యూహములను ఎప్పటి కప్పుడు తెలిసికొని సులభముగా భేదింపవచ్చును.

యాచమ : అది నేను గ్రహించితిని. ఇక మన సేనలను ఎచట కేంద్రీకరించుట మంచిదని మీయభిప్రాయము?

రఘు : కుంభకోణమునందు. అచట మనబలములకు సాహాయ్యము లభింపగలదు. ఇచటి పరిస్థితులను బట్టి సేనల స్థావరమునకు అదెంతయు తగియున్నది.

యాచమ : అట్లె. యుద్ధము ఎపుడు జరిగినను మన సైన్యములు సిద్ధముగా నుండవలయును. ఆ విషయమున మనము అప్రమత్తులమైయుండి సైన్యము సమకూర్చుట ఇప్పటినుండియే ప్రారంభింతము.

వారిరువురును లేచిరి.

ఈ సంభాషణ మంతయు దాపున గూర్చుండి వినుచున్న విజయ యాచమనాయనితో,

మహాశయా ! మీతో పాటుగా దానుకూడ నిచటికి వచ్చెదనని రామదేవరాయలు చెప్పినాడు. ఆయన రాకపోవుటకు కారణమేమియో ?

యాచమ : అమ్మా, అచటి పరిస్థితులు చాల గందరగోళముగా నున్నవి. రామదేవరాయలు అటనుండి కదలుటకు ఏమాత్రము వీలులేకయున్నది.

విజయ : వారంతటి యాపదలో నున్నారా?

యాచమ : ఏమోతల్లి! చెప్పలేము. జగ్గరాజు అతిక్రూరుడు. మాయలమారి. రంగరాయ మహారాజులు అతిసాధువు, ధర్మపరుడు, దయాపరుడు. నేనచటికి చేరునప్పటికి పరిస్థితులు ఎట్లు విషమించునో చెప్పజాలను. భయపడుచునే ఇటకు వచ్చితిని.

విజయ : (తండ్రినుద్దేశించి) నీవు నాకు సర్వశాస్త్రములతో

పాటు ధనుర్విద్యయు నేర్పించితివి. దర్బారులో గూర్చుండ బెట్టుకొని రాజ్యాంగ తంత్రమున అనుభవము గడింప జేసితివి. ఇపుడు తమరు నాకొక చనవు దయచేయ వలయును. యాచమనాయని మాటల ప్రకారము గొప్ప విప్లవము జరుగుచున్నదని తోచు చున్నది. నేను యాచమనాయనితో ప్రయాణించి రాయవేలూరు చేరి అచటి పరిస్థితులను జూచి, మరల వచ్చి మీ కవన్నియు విన్నవింపగలను. ఈ మహా విప్లవమున-ఈమహాయుద్ధమున - మన యందఱకు అభిమాన పాత్రమైన విజయనగర సామ్రాజ్యక్షేమ ప్రయత్నములందు నాయుడుమతి భక్తని చూపవలెను.

రఘు : తల్లీ! ఇది సాహసమే యగునేమో !

విజయ : కాదుతండ్రీ ! ఇది మీయందఱకు వలెనె నాకును విధి. ఏమందువు యాచమనాయకా ?

యాచమ : ఏమనగలను తల్లీ ! నినువంటి పుత్రికను కనుటం జేసి, రఘునాథరాయలు ధన్యుడైనాడని నాయుద్దేశము.

రఘు : సరియె తల్లీ ! నీయిష్టము. నారక్తమును నాసంతానము నాసర్వస్వమును తుదకు నాప్రాణములను విజయనగరసామ్రాజ్య సంరక్షణకై బలియీయగలను. భగవంతుడు ఆమహాసామ్రాజ్యమును రక్షించుగాక !

యాచమ : మీపలుకులచే ఒడలెల్ల పులకలమయమగు చున్నది. నాబొందిలో ప్రాణమున్నంతవరకు విజయనగర సామ్రాజ్యమునకు ఎట్టిభంగము కలుగనీయను.

విజయ : విజయనగరసామ్రాజ్య సంరక్షణమే నా జీవితాశయ మగుగాక!

యాచమ : (నవ్వుచు) నేడు విజయనగరసామ్రాజ్య సంరక్షణ మనగా రంగరాయ రామదేవరాయలసంరక్షణమే గదా!

అచటి యామున్గుల్లి మందహాసరోచులచే అచటి గదియే ఒక క్రొత్త లావణ్యసంభరితమై పోయినది.

## 12. దురాక్రమణము

"ఎల్లవారలు సెగించిన గుల్లమూకను" — కళాసుందరీపరిణయము

శ్రీరంగరాయలుఅంతఃపురమున గూర్చుండియుండెను. ఆతనిభార్య ఓబలదేవియు, పుత్రుడు రామదేవరాయలు, చిన్న పిల్లలును, చంటిపిల్లయు మహారాజుగారి చుట్టును చేరియుండిరి. ఆదినమంతయు సుడిగాలి వీచుచునే యుండెను.

రామదేవ : నాయనా! యాచమనాయని లేఖయందలి సంగతులను తెలిసికొనియు దుర్గాధ్యక్షుని క్షమించితివి. ఆతనిని పూర్వపుపదవియందే యుంచితివి. ఇది యక్రమ మని తోచుచున్నది.

రంగ : వానిపై మోపిన నేరము సాక్ష్యముచే ఋజువుకాలేదు. పైగా వాడు గంపెడుబిడ్డలు గలవాడట. పాదములపై బడి ఏడ్చినాడు. మరి యింక ఏమిచేయగలను.

ఓబలదేవి : కడుపులో చేయివెట్టి కలచినట్లున్నది. కారణము కానరాదు.

రామదేవ : ఆ దుర్గాధ్యక్షుని కొంతకాలము కారాగారమున నుంచుట మంచిదని నా యభిప్రాయము. జగ్గరాజు మొదలగువారు చేయు కుట్రలసంగతి తేలిన తరువాత వానిని విడిచి వేయవచ్చును.

రంగ : జగ్గరాజు కుట్రలసంగతికూడ తేలిపోయినట్లే. వారి యొద్దనుండి ఉత్తరము వచ్చినది. వారు ఇంతవఱకు జరిగిన రాజ సందర్శన విలంబమునకు క్షమార్హులము యుంటిమనియు, ఆ విలంబము అనివార్య మగుట చేసి క్షంతవ్యుల మనియు, అనుజ్ఞ నిచ్చినచో వచ్చి కానుకలు చెల్లించి వినయ విధేయతలుగల సామంత ప్రభువులుగా నుండగలమనియు తెలిపినారు. మాకరాజు, రావెల వేంకటపతి మొదలగు వారుకూడ అట్లు చేయగలమనియు తెలిపినారు. కావున ఇక కుట్రలు లేవు కుట్రలు లేవని నా యుద్దేశము.

రామదేవ : ఇట్లు వ్రాయుట నయవంచనము కాకూడదా !

రంగ : ప్రతి విషయమును ఇట్లు వితర్కించుకొనుచు పోవుచో మన మే నిర్ణయమును జేసికొనజాలము.

రామదేవ : ఎల్లవేళను మనము జాగ్రత్తగా నుండుట మంచిది.

ఆ యుత్తరమునకు మీ రేట్టి జవాబు నొసగినారు ?

రంగ "మీరు ప్రకటించిన భక్తికి సంతసించితిని. సార్వభౌమ దర్శనము చేసికొనవచ్చును. మీ కొఱకై దుర్గద్వారములు తెఱచి యుంచబడును" అని వ్రాసి వారు పంపిన దూత ముఖముననే పంపితిని.

**రామదేవ :** ఎంతపని జరిగినది తండ్రీ ! శత్రువులపట్ల-అందులో కుట్రదారుల విషయమున ఇంత ఉదారముగా అమాయకముగా ప్రవర్తింప నగునా ?

**రంగ :** రామదేవా ! పట్టి అనుమానములు మానుము. జగ్గరాజు మొదలగువారు అతి బలవంతులు సైనసామంతులు. వారు చేరినచో సామ్రాజ్యము బలపడగలదు. ఇందు వంచనగాని మోసముగాని యున్నదని యనుకొనను. కుట్రయే యున్నచో మన కోటలోనికి వచ్చి మన చేతులలో చిక్కుకొనుటకు వారికి ధైర్యముండునా! వారు వచ్చువేళ సమీపించుచున్నది. మన మా ప్రయత్నమున నుండుట మంచిది.

**రామదేవ :** అపుడే అంతదూరము వచ్చినదా ? నేను పట్టణమున లేకపోవుటయు అనర్థదాయకమైనది. యాచమనాయని లేఖను, నీరి యుత్తరమును గమనించిన మీదట నాకు ప్రబల సందేహములు కలుగుచున్నవి అమ్మగారి యాందోళనగూడ నిర్నిమిత్తమైనది కాదని నాయుద్దేశము. ఇపుడు చేయునది యేమి ? అంతఃపురమును రాజసౌధమును కాపాడుటకు మెరియల వంటి భటులను నియమించుట మంచిది. అట్లు చేయింపుడు.

**రంగ :** అట్లే.

అనుసంతలో రాయలవారి ముద్దుబిడ్డ కిటికీగుండ చూచుచు ఇట్లు పలికెను. "తండ్రీ ? మమ్ము విడిచి యెచటికిని పోవలదు. అరుగో దుర్గద్వారమున ఎందరు భటులు ఉన్నారో

చూడుము. వారియొద్దకు నీవు పోవలదు. వారిని చూచిన నాకు భయము వేయుచున్నది.''

అని ఏడ్చుచు రాయల పాదములను తన చిన్ని చేతులతో బంధించెను.

అంతలో ఒకదూతవచ్చి—

మహాప్రభూ! జగ్గరాయాదులు దుర్గమున ప్రవేశించినారు. కానుకలని చెప్పుచు గుఱ్ఱములమీద బండ్లమీద చాలసామాను దెచ్చినారు. వెంట పెక్కుమంది భటులు సేవకులు ఉన్నారు.

తమయాజ్ఞ అయినదని దుర్గాధ్యక్షుడు వారల నందఱను లోనికి రానిచ్చినాడు.

రంగ : మంచిది, రామదేవరాయా! నీవు ఎదురేగి వారలను ఆహ్వానించి సత్కరింపుము.

రామదేవ : తండ్రీ! అనుజ్ఞలేకుండ కోటలో ప్రవేశించిన వారికి ఆహ్వానములేల! ఆతిథ్యములేల! ఎవరురా అక్కడ.

భటుడు : చిత్తము మహాప్రభూ!

రామదేవ : నీవుపోయి వెంటనే దళవాయిని ఇటు రమ్మని చెప్పుము.

భటుడు : చిత్తము స్వామి?

రామదేవ : త్వరగా—

పెద్దమ్రోత వినబడును.

రంగ : అదేమి ! కోటబురుజులు పడి పగిలిపోవుచున్నట్లు భీకర ధ్వనులు వినవచ్చుచున్నవి !

రామదేవ : తండ్రీ ! (బయటచూచి) కొంపమునిగినది. మందు పెట్టి శాబోలు నగరసైన్యస్థానములైన శాలలను పడగొట్టినారు. సైనికులు, ప్రజలు గందరగోళముగా వీధులవెంట బడినారు

ఓబలదేవి: హా దైవమా! అని మూర్ఛిల్లినది.

చంటిపిల్లలు తల్లిప్రక్క బడి ఏడ్వ ప్రారంభించిరి.

భటుడు మరల ప్రవేశించి ఉద్వేగముతో:—

"మహారాజా! అంతయు మోసము. దుర్గము జగ్గరాజు స్వాధీనమైనట్లె యున్నది. ప్రతి ద్వారము నందును వాని రక్షక భటులే. మన భటులందరు చెల్లాచెదరైనారు. దళవాయి యెందును గానరాలేదు. ఎవరిని వెదకుటకు ఇది అదనుకాదు. ఎవరిని పిలుచుటకు ఇది నమ్మదగిన కాలముగాదు. ఆత్మరక్షణోపాయము ఒక్కటే శరణ్యము." అని కన్నీటితో జెప్పెను

దూతరూపముననున్న—మూర్తీభవించిన యా రాజభక్తిజూచి, రంగరాయల కన్నులు చెమ్మగిల్లెను. మూర్ఛపోయియున్న ఓబలదేవిరూపముననున్న — పరమ దీనత్వమును జూచి—ఆయన హృదయము కరిగిపోయెను. శోకదేవతారూపము గైకొన్న—ఆ పసిపిల్లల గోడుజూచి ఆమహారాజు నిలువున నీరైపోయెను. ఖడ్గహస్తుడై - మూర్తీభవించిన శౌర్యమునవలె—ద్వారమున కడ్డముగా నిల్చుండిన యువరాజును జూచి—ఆ మరంతనైన చింతా సముద్రములో —

లో లోపల ఆ మహారాజునకు నవ్వు వచ్చుచుండెను. గర్భిత సామ్రాజ్య నాశన శక్తి స్వరూపమును ధరించిన బయటి విప్లవమును చూచి ఆ మహారాజునకు విచారము నిండుకొనియె.

ఇన్ని భావ పరంపరలు చెలరేగుచుండ ఆ మహారాజు మూర్తీభవించిన నవరసాధిష్ఠాన దేవతవోలె నిల్చుండి చేతులు జోడించి పైకెత్తి ఈశ్వరధ్యానము చేయుచుండెను.

అపు డెచటనుండియో మాకరాజు కొందఱు భటులతో నచటి కేతెంచి, రాజకుటుంబము నంతటిని ఖైదు చేసెను. యువరాజు రక్షణ ప్రయత్నము సముద్రమున నొక బిందు వయ్యెను.

అప్పుడు జగ్గరాజు అచటికి వచ్చి—

"రంగరాయా! ఈ దినము మొదలు నీవు మాఖైదీవి. రాజ్యకాంక్ష విడిచి నిశ్శబ్దముగా నవలికిపోయి ప్రాణములను దక్కించుకొనుము" అని చెప్పెను.

రంగ: జగ్గరాయా! ఈ కుట్రలేమి? ఈ మోసములేమి? ఈ అంతఃకలహము లేమి? ఈ సామ్రాజ్యముపై నా కెప్పుడును ఆశ లేదు. కాని ఈ సామ్రాజ్య క్షేమము నకై ప్రాణత్యాగము చేయగలను. కబురుచేసినచో నీకు సామ్రాజ్యమిచ్చి వైదొలగెడివాడను. ఈవిప్లవము-లేకుండ బోయెడిదే! సామ్రాజ్యము సురక్షితముగా నుండెడిదే!

జగ్గ: ఈ రిత్త యుపచారముల వలన ఫల మేమి? పొమ్ము: చెరసాలకు పొమ్ము.

పాప మా అహింసామూర్తి సకుటుంబముగా చెరసాల యందుంచబడెను.

---

# 13 రాయబారము

"ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్ఝగింపరుగదా ప్రజ్ఞానిధుల్ గావునన్"...భర్తృహరి

యాచమనాయుడు విజయముతో పెనమాడికి తిరిగివచ్చెను రాయవేలూరి వార్తలు వినుటతోడనే అతడు ఆగ్రహోదగ్రుడయ్యెను. ఎట్లైన జగ్గరాజును సాధించి రంగరాయల మహారాజును రక్షింపవలయునని ప్రతిన బట్టెను. పాపము విజయరాజ కుటుంబమునకు సంభవించిన దురవస్థకై మిక్కిలి విచారించుచుండెను.

ధైర్యము వీడక యాచమనాయని ప్రతిజ్ఞా నిర్వహణ విజయమున చేతనైన సాయముచేయ స్థిరసంకల్పు యయ్యెను.

అంతలో నొకభటుడు చనుదెంచి "రాయవేలూరినుండి యొక రాయబారి వచ్చియున్నా"డని మనవిచేసెను. యాచమనాయని యాజ్ఞచే రాయబారివచ్చి యొక లేఖ సమర్పించెను.

ఆ లేఖలోని విషయములను యాచమనాయుడు ఈక్రింది విధముగా చదువుకొనెను.

యాచమనాయుడు తన ప్రత్యేకభటులను పిలిచి వారలతో "మీరు మన కలుకూరాలు రైన మండలాధిపుల యొద్దకు పోయి సైన్యమును సమాయత్తము జేయవలసినదిగా విన్నవింపుడు" అని హెచ్చరించి పంపెను.

ఒకనాడు యాచమనాయుడు ఒంటరిగా గూర్చుండి యాలోచించుచుండెను. విజయ నెమ్మదిగా ప్రవేశించి "మహాశయా! ఏదియో దీర్ఘముగా నాలోచించుచున్నట్లు కనబడుచున్నదే" అని యనియె.

యాచము : ఇంకను ఆలోచించుట ఎందులకు తల్లీ! కావలసిన పనియేమో అయిపోయినది.

విజయ : ఇప్పుడు మన కర్తవ్యమేమి ?

యాచము : యుద్ధము—రాజకుటుంబ బంధవిముక్తి — రంగరాయలను సామ్రాట్టుగా స్థిరపఱచుట.

విజయ : తమకు నేనొక్క యాలోచనను చెప్ప సాహసింపవచ్చునా ?

యాచము : చెప్పుము తల్లీ! నీ శాస్త్రవిజ్ఞానము, నీ తెలివితేటలు, నీ రాజ్యాంగ తంత్ర ప్రావీణ్యము — నాకు బాగుగా తెలియును. నన్నును మీతండ్రిగనే భావించి ఆయనయొద్దవలెనే చనవుగా మెలగుచు నీ యుద్దేశములను చెప్పుచుండుము.

విజయ : పినతండ్రీ! రాజకుటుంబము శత్రువులచే బంధింపబడి యున్నది. జగ్గరాజు మహాక్రూరుడుగా నగపడుచున్నాడు. మనము వెంటనే యుద్ధముచేసి శత్రువులను జయించినను ఫలములేదు. ఏలయన బంధీకృతులైన రాజవంశమువారిని అతడునిర్దాక్షిణ్యముగా సంహరింపవచ్చును. అపుడు మన పని ఏమగును? మనము ఎవరికోసము యుద్ధముచేసినట్లు? ఎందులకు జయము పొంది

నట్లు ? కావున జగ్గరాజు మనలను ఏరీతిగా వంచించి నాఁడో ఆరీతిగనే జగ్గరాజును వంచించి కార్యము నెఱవేర్చుకొనవలయును.

యాచమ : మంచి యాలోచనము.

విజయ : పినతండ్రీ! వినుము. ఉపాయముతో నున్న రాజకుటుంబమును చెఱనుండి విడిపించి మనరక్షణలోనికి తీసికొని రావలయును. అప్పుడు మనము యుద్ధము చేయవచ్చును. జయమందవచ్చును.

యాచమ : నీవు చెప్పునది బాగుగా నున్నది.

అని చెప్పునంతలో భటుడొకడువచ్చి "స్వామీ ! జగ్గరాజు రాయబారి మరల వచ్చినాడు." అని చెప్పి నాయని అనుజ్ఞపొంది రాయబారిని తీసికొని వచ్చెను.

రాయబారి కేలోడ్చి యాచమనాయనికి యొక కమ్మ అందించెను.

యాచమనాయడు ఇట్లు చదువజొచ్చెను.

మహా మండలాధిపతియగు యాచమనాయనికి—

నీవు పంపినకబురు అందినది. నాలుగువేల సైన్యముగల నీవు మమ్మేమి చేయగలవు? నీవు మాయొద్దకు రానిచో మేమే నీయొద్దకు వచ్చి సర్వనాశనము చేయగలము.

పూర్వము నీవు సామ్రాజ్యమునెడ నెఱపిన భక్తిని పురస్కరించుకొని మఱి రెండుముక్కలు వ్రాయ సంకల్పించినాము. చెడిపోక వినుము. నీవు నా మేనల్లుని పక్షమున

నందువేని పెక్కు భూములనిచ్చి నిన్ను గొప్ప యున్నతపదవికి కొనితేగలము. ఇది మా వాగ్దానము.

జగ్గరాజు

లేఖ చదువుకొని రాయబారితో "మీ ప్రభువు చాల యోగ్యుడు. సామదానభేద తంత్రముల నుపయోగించి నన్ను వశపఱచుకొన జూచుచున్నాడు. వీనివలన లాభము లేదు. చివరి యుపాయమునకు సిద్ధపడియుండుమని చెప్పుము. నాకు భూము లిచ్చుటకు ఆత డెవడు? అస లాతనికి భూము లెక్కడివి? ఈ భూము లన్నియు రంగరాయ మహారాజులుగారి వని తెలుపుము. ఇక నీవిటకు రావలసిన పనిలేదు. పొమ్ము" అని చెప్పెను.

రాయబారి వెడలిపోయెను.

విజయ: పినతండ్రీ! ఇపుడు నాకొక యుపాయము తోచుచున్నది. దాని బాగోగులను ఆలోచింప వలయును.

యాచమ: ఏమి యుపాయము తల్లీ!

విజయ: రాయవేలూరి యందలి రాజవంశమువారి చాకెత నాకు బాగుగా తెలియును. మైలగుడ్డలను చిన్ని గంపలలోనుంచి వారు తీసికొని పోవుచుందురు. అట్టి గంపలలోనొక దానిలో గుడ్డల మధ్యనుంచి యువరాజును మనము తేవచ్చును. పెద్దవారగు రంగరాయలవారు గంపలో ఇముడుదురోలేదో? ఇమిడినచో వారినే తెత్తుము. వారిరువురు ఇమడనిచో చిన్న పిల్లనైన తెత్తుము. వంశాంకురమైనను మిగిలియుండుట మంచిది గదా!

యాచమ : చక్కని యుపాయము పన్నితివి తల్లీ!
విజయ : చాకెత నాకు బాగుగా తెలియును. మఱియొకరికి
అది హృదయ మిచ్చునో లేదో?
యాచమ : అయిన నీవే పోవుదువా?
విజయ : గత్యంతరము లేదు.
యాచమ : జాగ్రత్తగా ప్రవర్తింపవలయును. నీ తెలివి తేటల యందు నాకు పరిపూర్ణ విశ్వాసమున్నది. నా ప్రత్యేక భటులను నల్గురై దుగురను ఇచ్చి బంపెద. వారందఱు అశ్వారూఢులై ఈయూరి బయటగల అరణ్యమునందు నిలురు. నీవు నీపనిని నెఱవేర్చుకొని సంకేతస్థలమునకు వచ్చి, గుఱ్ఱము నధిరోహించి వెంటనే బయలు దేఱుము. మీకు శుభము గలుగుగాక.

# 14. ఆశాపాశము

"ఆశాపాశము తాఁ గడున్ నిడుపు లేదంతంబు రాజేంద్రము"—భాగవతము

జగ్గరాజు సేనలను సమాయత్తపఱుచుటకు సన్నాహములు చేయుచుండెను. ఆపనిమీద మాకరాజును రావెల వేంకటపతిని పంపి ఎప్పటివార్తలు అప్పుడు తన కందునట్లుగా నేర్పాట్లు చేయవలసినదిగా వారల కాజ్ఞాపించెను.

పూర్వదుర్గాధ్యక్షుని పనినుండి తొలగించి, ఆతనిసమస్త విత్తమును స్వవశము చేసికొని ఇతనిని బందిఖానా యందుంచెను. యాచమనాయని దుర్గపరిసరముల గూఢచారుల నియ

మించి, అతని రాకపోకలను గురించి ఎప్పటికప్పుడు తెలిసి
కొనుచుండెను. సమయముచిక్కినపుడు యాచమనాయని సర్వ
నాశనము చేయుటకై వలయుసేనలను సిద్ధపఱచి యుంచెను.
ఒక్క యాచమనాయని పీడవదలినచో గుండెపై చేయి వేసికొని
నిద్రింపవచ్చునని ఆయన భావము. దూరస్థుడైన రఘునాథ
రాయలు ఒంటరిగా తన కెట్టియుపకారము చేయజాలడని విశ్వ
సించెను. అతనికొకవేళ విజృంభించినచో పాండ్యమండలాధి
పతియు తుండీరమండలాధిపతియు నతని నాక్రమించుటకు తగియుందు
రని విశ్వసించి యుండెను. యుద్ధముజరుగుచో దక్షిణభాగము
ననే జరుగగలదని యాతడు విశ్వసించెను.

సామ్రాజ్యపు టుత్తరభాగమున చెప్పుకోదగిన కల్లో
లము లేమియులేవు. అందుచే అతని శ్రద్ధయంతయు దక్షిణ
భాగమున కేంద్రీకరించియుండెను.

దక్షిణమున మహాబలవంతులైన మహామండలాధి
పతులు ఇర్వురు తనపక్షమున నుండుటచేతను, దక్షిణదిక్కు
ననే యుద్ధముజరుగు సవకాశములుండుటచేతను ఆతడు నిర్భయ
ముగానుండి యుద్ధముల జయము నిశ్చయమను పరమ విశ్వా
సముతో నుండెను. ఎటుతిరిగి యొకయాచమనాయడు—ఒక
కేవల మండలాధిపతి—నాల్గువేలసైన్యములు గలవాడు
తన్నేమి చేయగలడు? అను ధీమాతో నుండెను. ఉత్తరము
నుండి దక్షిణమునకు యాచమనాయని సేనలు పోకుండునట్లు
పెక్కుకట్టుదిట్టములు చేసెను. యాచమనాయని సేనలు రఘు
నాథరాయల సేనలతో గలియుటకు తుండీరమండలాధిపతి దేశ

షు నుండి పోవలయును వారిరువుర సేనలను కలియనీయకుండ జేయువలయునని తుండీర మండలాధిపతిని వేయికన్నులతో కని పెట్టి యుండవలసినదిగా ఆజ్ఞాపించెను.

ఈ వెల వేంకటపతి తుండీరమండలమునందును మాక రాజు మధురయందును ఉండి జగ్గరాజు ఆజ్ఞలన్నింటిని పరిపా లించుచుండిరి.

చక్కని శిక్షణము పొందిన ఒలందుల పటాల మొకటి తనక్రింద నట్టిపెట్టుకొని అపటాలమునకు అసాధ్యమేమియు లేదని నమ్మి యుండెను.

యజ్ఞనారాయణ దీక్షితులు అను కవీంద్రుడు ఒలందు లను (పోర్చుగీసువారు) గూర్చి ఇట్లు వర్ణించి యున్నాడు.

"వీరిమీసములు పొడవుగ నుండును. కనుబొమలు వంగి యుండును. వారి ముఖములు కోల ముఖములు. మేనులు రాగిరంగు గలవి. వారు బొట్టుపెట్టరు. చెవులకు పోగులు ధరింపరు. ఎట్టి లాగులు తొడిగికొందురు. కవచములు ధరిం తురు. తాంబూలము సేవింపరు. టోపీలయందు ఎట్టి పక్షి యీకలు ధరింతురు. కల్లుకంపుకొట్టు శ్వాసములు గలవారు. పెద్దకత్తులను తుపాకులను చేబూని యుందువారు"

ఈ వర్ణనము పోర్చుగీసుపటాలమువారి సంగతులనే కాక ఆకాలపు ఆచారవ్యవహారములనుగూడ దెల్పుటచే ఇందు ఉదహరింప బడినవి.

తన కట్టి పటాలముగలదని నిజముగా జగ్గరాజు విఱ్ఱ వీగుచు ఎవ్వరిని లెక్కపెట్టక, మేనల్లునిపేర తానే స్వామా

జ్యము పాలింపవచ్చునను ఆశాపాశములో నుండెను. కాని యాచమనాయడన్న ఆతనికి గుండెదిగులు లేకపోలేదు.

వేంకటగిరి పురాధీశ్వరుడైన కస్తూరి రంగప్పనాయుడు యాచమనాయని తండ్రి. కాళహస్తి పురాధీశ్వరుడైన దామెర్ల వేంగళనాయుడు ఈతని మాతామహుడు. వీరిరువురును సామ్రాజ్యసేవయందు సిద్ధహస్తులు. అఖండమైన సామ్రాజ్యాభిమానము గలవారు. యాచమనాయుడు అవసరమగుచో తండ్రివైపువారిని తల్లివైపువారిని యుద్ధరంగమునకు దీసికొని రాగల నేర్పరి. అదియుగాక యాచమనాయుడు స్వయముగా పరమ రాజభక్తిపరుడు. సామ్రాజ్యమునందు అభిమానము గలవాడు. ఎన్నియాశలు పెట్టినను అతడు రంగరాయల పక్షము వీడకుండెను. సుగుణము కలవాడగుటం జేసియు, సమర్థ బాహుసంపత్తిగలవాడగుటం జేసియు, అఖండ పరాక్రమశాలి యగుటం జేసియు యాచమనాయని వలన జగ్గరాజునకు హానిగా నుండెను.

అందువలననే జగ్గరాజు పెనుమాడిదుర్గ పరిసరముల నేర్పరులైన గూఢచారుల నియమించినాడు. అందువలననే యాచమనాయని రాకపోకల విషయములు గనుగొనుటకు అంత యత్నాసక్తి చూపుచున్నాడు. అందువలన ఆతని తన పక్షమునకు లాగికొనుటకు అతిమాత్ర ప్రయత్నములు చేయుచున్నాడు.

ఈ తుదికోర్కె మాత్రము ఫలించునది గాదని యాతనికి దెలియును. మనకును దెలియును. అయినను దెలిసి దెలిసి

అందనిపండ్లకు అఱ్ఱులుచాచువారు ఈ ప్రపంచమున ఎందరు లేరు! వారిలో జగ్గరాజొకడు.

## 15. బంధవిముక్తి

"మంత్రియుగంధర్ పేరుచెప్పితే ప్రేలునుతుపాకి"

—ప్రతాపరుద్రీయము

యాచమనాయుడు తన కోటబురుజు పైనుండి రాయ వేలూరు మార్గమున దృష్టిసారించి చూచుచుండెను అతడట్లెంత సేపటినుండియో చూచుచుండెను. అట్లు చూచి చూడగా దూరమున ధూళి లేచుచున్నట్లు తోచెను.

ఆతడు దృష్టినిగుడించి పాదములపై కెత్తి అట్లు చూచు చుండెను. ధూళిస్పష్టముగా గోచరించెను. చెవులురిక్కించి ఆల కింప ప్రారంభించెను. కొంతవడికి సూక్ష్మధ్వని వినవచ్చెను. అదిడెక్కల ధ్వనియా? సుశిక్షితములైన యాతని చెవులు అది డెక్కలధ్వనియే యని గుర్తించెను.

ఇకనటనుండుటకు ఆతనికి తోచదయ్యె. అదివరకే చక్షువులకు, శ్రవణములకు వానిశక్తికి మించినపని యిచ్చుటచే ఇకనవి వాని యాజ్ఞలను పాలింప నిరాకరించినవి. మనస్సు ఆందోళనచే వివశమగుచుండెను. ఇక నటనుండుట నిష్ఫల మని భావించి యాతడు సౌధమును ప్రవేశించి విశాల రమణీయమైన గదియందు పచారుచేయుట ప్రారంభించెను. అట్లు ఎంతసేపు పచారుచేసెనో?

ఆతనికి నిమిష మొక యుగముగా గడచుచుండెను. అంతలో—అయిదు ఉత్తమజాతి అశ్వములు కోటలో ప్రవేశించెను. విజయ కంఠమునుండి కొంచముగా రక్తముకారుచుండెను. రామదేవరాయలు చేతిరుమాలుచింపి రక్తపుబొట్లు. మఱియొకగుఱ్ఱముపై నొక ముదుసలి కూర్చుండియుండెను. ఆమెను పట్టుకొని, యాచమనాయని ప్రత్యేక భటుడు కూర్చుండెను. మఱియొక గుఱ్ఱముపై ఇరువురు ప్రత్యేక భటులు కూర్చుండిరి.

యాచమనాయుడు, విజయ ఎక్కియున్న గుఱ్ఱమును సమీపించి, నెమ్మదిగా విజయను వంక "తల్లీ! ఈగాయమేమి" అని యడిగెను.

విజయ : (యువరాజునుజూపి) 'ఇది వారిదయ' అని అనెను.

యాచమనాయని కేమియు సంతోషముకాలేదు. ఆతడు రామదేవరాయలను కౌగిలించుకొని "యువరాజా! సుఖముగా వచ్చితివా? అందఱు కుశలులేగదా? మహారాజుగారు క్షేమముగా నున్నారా?" అని యడిగెను.

రామదేవరాయలిట్లు చెప్పెను.

యాచమనాయకా! మాతండ్రిగారు క్షేమముగానే యున్నారని చెప్పెదను. 'మీ భక్తికి మీ అభిమానమునకు హృదయ పూర్వకముగా కృతజ్ఞులమై యుందు' మని చెప్పుమనినారు.

యాచమ : ధన్యుడను. ప్రభువులవారికి ఒకింత సేవచేయ గల్గినందులకు నన్నింతగా పెద్దచేయవలసిన పనిలేదు. అది

గాక. ఇందు నా ప్రయోజకత్వ మేమియులేదు. ఈ శుభోదంతమునకు విజయయే కారకురాలు. ఔను. మఱచితిని. (అనుచు) విజయా! గాయమునుండి ఇంకను నెత్తురు గారుచున్న దేకారణము చెప్పవైతివిగా తల్లీ!

**విజయ :** (నవ్వుచు) విజయనగర సామ్రాజ్యమును గురించియు మహారాయలుంగారిని గురించియు, యువరాజులుం గారిని గురించియు సంభాషణలు పూర్తి కానిండు. వానిముందు నా గాయమునంగతి ఏ పాటిది?

**యాచమ :** అదిగాదు తల్లీ! ఇంటిలోనికిపోవుదము. కారణము చెప్పినను సరియె, చెప్పకున్నను సరియె. గాయమునకు ముందుగా కట్టుకట్టవలయును.

**రామదేవ :** యాచమనాయకా! మేము ఈ ముదుసలిచాకెత ద్వారా, విజయా సాహాయ్యమువలన చెఱనుండి యవలబడి సంకేతస్థలమును జేరి, అశ్వముల నధిరోహించి అత్యంత వేగముగా వచ్చుచుంటిమి. మావెనుక నే యొకను అశ్వారూఢుడై వచ్చుచున్నజాడ కొంత ప్రయాణముచేసిన తరువాత కనిపెట్టితిమి. అయ్యశ్వారూఢుడు మిమ్ములనేమరించి కొంతసేపటికి అగపడ లేదు. తరువాత పదిమంది యాశ్వికభటులువచ్చి మమ్మెదిరించిరి. జగ్గరాజుపక్షమువారై యుందురని యూహించి వారి నెదుర్కొంటిమి. వారు పదిమంది. మేము అయిదుగురము. అయినను ప్రాణములకు తెగించి పోరితిమి. విజయచూపిన శౌర్యమునకు అంతేు

తరువాత నొకనాడు రామదేవరాయలును విజయయు యాచమనాయుడును సంభాషించుకొనుచుండిరి.

యాచమ : తల్లీ! నీవును రామదేవరాయలను తంజావూరు చేరుట క్షేమంకరమని నాయుద్దేశము. యువరాజు తప్పించుకొని పోయినాడనియు, పెనుమూడికోటలో నున్నాడనియు ఈపాటికి జగ్గరాజునకు తెలిసియుండును. ఇక నతడు రామదేవరాయలను మజల చేజిక్కించుకొనుటకై ఎట్టిప్రయత్నములైనను చేయును. ఈదుర్గమును నాతడు ముట్టడించుననికూడా నాయభిప్రాయము నేను కోట రక్షణ ప్రయత్నములలో నుండవలయును. మీరిరువురును సురక్షితముగా తంజావూరు చేరిన కోట ముట్టడి పర్యవసానమేమైనను ఇబ్బంది లేదు.

రామదేవ : శౌర్యశిఖామణీ! ఈసమయమున నిన్నొంటరిగా విడిచి నేను తంజావూరుపోయి సుఖపడుట భావ్యము కాదు. అదియుంగాక మహారాజుగారిని, కుటుంబమును గూడ మనము చెర విడిపింపవలసియున్నది.

యాచమ : యువరాజా! నామాట వినుము. వేయిమంది జగ్గరాజులైనను నాకోటను స్వాధీనము చేసుకొనజాలరు. కోటయందు ఆహారసామగ్రి మూడేండ్లకు సరిపోగలదానిని చేర్పించితిని. మేము కోటలోనుండి మూడేండ్లు నిశ్చయముగా పోరాడగలము. వల్లదప్పి వచ్చిచో బయటనుండి మాతండ్రిగారి—తాతగారి సైన్యములువచ్చి, కోటను ముట్టడించిన సేనను, రెండు

వైపుల ముట్టడించి సర్వనాశనము చేయగలవు. అదియుంగాక కబురంపినచో ఇరువదివేల సైన్యము నన్ను జేరగలదు. ఇన్ని వసతులున్నను, మీరిట నున్నచో నా ప్రయత్నములు వ్యర్థములు కావచ్చును. కావున మీరు తంజావూరు పోవుట యే శ్రేయస్కరము. ఆలసించినచో మీరు తంజావూరుపోవుటయు దుర్లభమగును. తుండీర మండలాధిపతి తంజావూరు పోవు రాయబారులను అడ్డగించుచున్నాడని నాకు వార్తలు వచ్చుచున్నవి.

నా ప్రత్యేకభటులను తోడుగానిచ్చి మిమ్ము పంపెదను. మీ కేమియు భయములేదు. నా గూఢ చారులును రఘునాథరాయలవారి గూఢచారులును తుండీరమండలమున తండోపతండములుగానున్నారు. వారు మీకు పలుయు సాహాయ్యములు చేయగలరు. పోవుటకిది మంచితరుణము. ఆలస్యము చేసినకొలదియు ఆటంకములు హెచ్చగును.

విజయ : మహారాజులవారి విముక్తి అగునంత పర్యంతము ఇచట నుండుట మంచిదేమో మీరే ఆలోచింపుడు.

యాచమ : అవసరములేదు. నేను ఆ ప్రయత్నములలో నుందును. దానిని గురించి ఇదివరకే ఆలోచించియుంటిని. మీకు తెలిపెదను వినుడు. రాయవేలూరులోని ఒక సంకేతస్థానమునుండి జైలుఖానావఱకు నా ప్రత్యేక భటులచే సొరంగము త్రవ్వించుచున్నాను. వారము

పది దినములలో మహారాజులు కుటుంబముతో సహా నా కోటను చేరగలరు. ఆవిషయము నాకువదలి వేయుడు. నేను ప్రత్యేకభటులను తయారు చేయుచున్నది, మహారాజులవారి సంరక్షణార్థమే. మహారాజుల వారి రక్షణము క్షేమ మగుటతోడనే యుద్ధము ప్రారంభమగును. త్రోవలు చెదిరిపోవును. అటువారిటు, ఇటువారటు పోవుట కష్టమగును. అప్పుడు యువరాజును పంపుటయన్న సామాన్యము గాదు. మీరు సక్రమముగా ఆలోచింపుడు.

రామదేవ : యాచమనాయకా! మమ్ములను రక్షించుటకే భగవంతుడు నిన్ను సృష్టించినట్లున్నాడు. నీవు చెప్పినట్లే చేసెదము.

యాచమ : యువరాజా! మీరు వెళ్లుటవలన మరియొక ప్రయోజనముగలదు. మీరు స్వయముగా నచటికి పోవుటచే మీ సందర్శనభాగ్యమబ్బి కొందఱు మహా సేనాపతులు మన పక్షమునకు రావచ్చును.

విజయ : నాతండ్రీ! నీవు యుగంధరమంత్రివలె నున్నావు. మేము తంజావూరునకు బోయెదము. నీయందు పరిపూర్ణ విశ్వాసమున్నది. ఈ ముదుసలి చాకెతనుగూడ తీసికొని పోయెదము. దానిని మాతండ్రిగారికి చూపవలయును. యుద్ధానంతరము మనకు విజయము లభించినప్పుడు అది మరల రాయవేలూరు చేరగలదు.

యాచమ : తల్లీ! నీయిష్టము.

—★

మిమ్ము సైన్యముగా ఎంచుచున్నారు. పోర్చుగీసు పటాలములు పాండ్యరాజునొద్ద కలవు. ఆపటాలములచే మనుష్యులోని తన సైన్యములు కొన్నింటికి తరిఫీయుతు సిక్షించుచున్నారు.

జగ్గ : విరూపాక్ష మొన్నటికిని తీర్చుకొనలేను. ఇచటి కోటలోని విశేషములను వింటిరి గదా! రామదేవరాయలు తప్పించుకొని పోయినాడు.

మాక-వేంక : మార్గమధ్యమున నే ఈవార్త వింటిమి.

జగ్గ : దూరమున కట్టుదిట్టములు చేసికొనుచు కోటలోని పక్షిని ఎగిరిపోనిచ్చితిమి.

మాక : రంగరాయలను బెదిరించి సత్యము లాగలేదా?

జగ్గ : బెదరింపకేమి! సహాయముగ నాతని సంహరించెద నంటిని, కాని యాతడేమియు బెదరను బెదరడు, కలగాపు చెప్పను జెప్పడు. ఎన్నిమారులు లడిగినను నేనేమియు చెప్పజాలనని ఒకటే సమాధానము. అతనికి మరణభయ మించుకయు లేదు. సామ్రాజ్యము నెడ ఆశ లేదు. అట్టివారిని మనమేమి చేయగలము?

వేంకట : ఆహారమును తగ్గించి వేయుడు. చావు బ్రతుకులలో నుండు మనుష్యుడు బింకము వీడి యథార్థము చెప్పగలడు.

జగ్గ : అదియు జేసితి. ముదుక బియ్యమును, పుచ్చకూరగాయలను చాల మితముగా నిప్పించుచున్నాను. ఆతడున్న దానితోడనే తృప్తిపడి ఒకపూటనే భుజించి ఎపుడును ధ్యానము చేసికొనుచుండును.

మూక : మొండివాండ్రు రాజుకంటె బలవంతులు. వాని నిక చేయున దేమి కలదు. ఇంకను ఏమేమి కుట్రలు పన్ను చున్నారో వారు.

జగ్గ : అదియే నాయనుమానము. మీకు లేనిపోనా కేమియు తోచుటలేదు. మీరిరువురు పోయి యొక మారు రంగరాయలను హెచ్చరించిరండు. గట్టిగా మందలించి రండు.

ఇరువురు "చిత్తముస్వామీ" అనుచు రంగరాయల యొద్దకు పోయి, ఆయన యున్న గదిని ప్రవేశింతురు.

రంగరాయలు ధ్యానతత్పరుడై యుండును.

మూక : రంగరాయ ప్రభూ! (అనుట తోడనే కన్నులు విచ్చి చూచును.) భోజనమైనదా?

రంగ : ఎవరు?—మూకరాజుగారు, రాచెర్ల వేంకటపతిగారు ఇరువురు దయచేసినారే! ఈ దినము సుదినము. భోజనము చేయలేదు. ఇప్పుడు రాత్రిపూట భోంచేయుటలేదు.

వేంకట : ఎందువలన ప్రభూ!

రంగ : వ్రతస్వీకరణ కారణమున.

మూక : స్వామీ! మీరు జగ్గరాజుగారితో సరియైనవార్తలు చెప్పుటలేదని వారికి చాల కోపముగా నున్నది. అనవసరముగా వారికోపమునకు గురియగుట యేల?

వేంకట : ప్రభూ! ఆయన మిక్కిలి కోపదారి. మిమ్మింకను

హింసలు పెట్టునేమో ? మీకు తెలిసిన విషయములు చెప్పరాదా ప్రభూ !

రంగ : నాయనలారా ! నేను చెప్పుటకు వీలుగాని విషయములు కొన్ని యున్నవి. అవి చెప్పుట కృతఘ్నత యగును. కృతఘ్నతా దోషమునకు నేను పాల్పడజాలను. ఆవిషయములను నేను చెప్పలేను. క్షమింపుడు.

మాక : మీకు ప్రాణాపాయము కూడ తటస్థింప వచ్చును. కుటుంబము కూడ నాశనము గానచ్చును. జాగ్రత్తగా ఆలోచించుకొనుడు స్వామీ !

రంగ : ఏమైన కానిండు. ఆవిషయములు నేను చెప్పజాలను. అన్నింటికిని భగవంతుడే యున్నాడు.

వేంకట : మేము సెలవుతీసికొందుమా ! నమస్కారములు.

రంగ : శ్రీకృష్ణార్పణమస్తు. మీకు శుభములు కలుగుగాక.

తమలో "ఈతను పరమసాధుపుంగవుడు. బెదరింపులకు లొంగడు. స్తోత్రములకు పొంగడు." అనుకొనుచు ఇరువురు నిష్క్రమింతురు.

అపుడు రాత్రి పదిగంటలైనది. రంగరాయలట్లె ధ్యాన తత్పరుడై కూర్చుండియుండెను. భార్యయు పిల్లలు నిద్రించుచుండిరి. కొంతవడికి ఆతడు ప్రక్కపై పరుండెను. కాని నిద్ర సరిగా పట్టుటలేదు, మాకరాజు చెప్పినమాటలు నెమ్మదినెమ్మదిగా ఆయన మనస్సులో పనిచేయ ప్రారంభించెను. తాను తన కుటుంబ కంఠములు, వెనకంటి మును జగ్గరాజు వృత్తరించు దృశ్యములు ఆతని మనోవీధిని గోచరించుచుండెను.

సగము నిద్రతో సగము మెలకువతో నున్న యా సమయ
మున ఏదో భూమిక్రింద చప్పుడగుచున్నట్లు గోచరించెను.

రంగరాయలకును భయాశ్చర్యములు క్రమ్మెను. సహ
జముగ నాతడు గుండె నిబ్బరముగలవాడు. అప్పటికి
దాదాపుగా నిశి సగమాయెను. రంగరాయలు కిటికీ తెఱచి
బయటికి దృష్టి సారించెను. అంతయు గాఢాంధకారము.
భూమిక్రింది చప్పుడు, అప్పుడు మఱికొంత ప్రస్ఫుటమయ్యెను.
కాని ఆతని మనస్సు ఆందోళన చెందుట మానెను. "ఈశ్వ
రేచ్ఛ ఎట్లున్న అట్లు జరుగును. దానికి యారాట పడనేల"
అనుకొనుచు ఆతడు ప్రక్కగదిలోని కేగి శాంతముగా నిద్రిం
చుచున్న భార్యను బిడ్డలను చూచెను. అకస్మాత్తుగా నాతని
కన్నులు చెమ్మగిల్లెను.

తిరిగి తన గదికి వచ్చెను. సాక్షాత్తుగా తాను నిల్చుండిన
భూమిక్రిందనుండియే చప్పుడు వచ్చుచున్నట్లు గ్రహించెను.
పోయి ప్రక్కమీద కూర్చుండి—ఆతురతతో అటువైపు
చూచుచుండెను. అకస్మాత్తుగా ఆ భూమి పైభాగము పైకి
లేచెను. రంగరాయలు అట్లే కూర్చుండెను. కన్నులు తెఱచు
కొనియున్నవి. కాని యతడు మామూలు స్థితిలో నుండెనో లేదో
చెప్పజాలము.

గదినుండి క్రిందిభాగమునకు ఒక పెద్ద సొరంగమేర్పడి
యుండెను. అందుండి యిరువురు యువకులు పైకివచ్చిరి. రంగ
రాయలు అప్రయత్నముగా లేచినిల్చుండి "మాకరాజా—
వేంకటపతీ రండు ముందుగా నా కంఠమును ఖండింపుడు. తరు

వాత నాకుటుంబమును సంహరింపుడు” అనుచు వారల ముందుచేరి నిలుచుండెను.

యువ : అయ్యా మేము యాచమనాయుని భటులము. మీకు మేలు చేయవచ్చితిమి. మీచే సంభోధింపబడు నామములు మావికావు.

రంగా : (రెండునిమిషముల సేపు వారిని పరికించిచూచి) నాయకులారా మీరా రండు! కూర్చుండుడు. యాచమనాయనికి క్షేమమా ?

యువ 2 : క్షేమమే ప్రభూ! తమ కీయుత్తర మిమ్మనినాడు. ఇదిగో ఉత్తరము. గ్రహించి అనుగ్రహింపుడు.

రంగరాయలు ఉత్తరము తీసికొని ఇట్లు చదివికొనియె.

(శ్రీ)రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీరంగరాయ మహారాజులుంగారికి సాష్టాంగ నమస్కారములుచేసి యాచమనాయుడు వ్రాయు విన్నపములు:—

తమరు ఏ మాత్రము సందేహింపక రాజభక్తిపరులైన యీ యువకుల వెంట సొరంగముద్వారా బయటికివచ్చి, వారు సూచించు విధముగా నా కోటను జేరుడు. మీరు ఏమాత్రము సందేహింపవలసిన పనిలేదు.

దివ్యచిత్తమునకు తేవలయును.
భృత్యానుభృత్యుడు,
యాచమనాయుడు.

రంగరాయలు యాచమనాయుని భక్తివిశ్వాసములకు సంతసించుచు అబ్బురపడుచు భార్యను బిడ్డలను లేపి, వారికి

ఆ తాటియాకు లేఖలోని సంగతులు చదివి వినిపించెను. వారందఱు ఆనంద నిమగ్నులైరి. యువకులు త్వరపడవలయునని తొందర పెట్టిరి.

రంగరాయలు భార్యతో "ఇటువంటిదే స్త్రీ విశ్వాసము" లతో ధైర్య సాహసములు చూపుచు నన్ను చెఱ విడిపింప దలంచు యాచమనాయని మాటలు ఉల్లంఘించుట నీకుగాదు. మీరందఱు తయారుగా నుండుడు" అని చెప్పి తాను తన దుస్తులు విసర్జించి చిన్న అంగవస్త్రమును ధరించి ఆలుబిడ్డలు ముందుగా, తాను వెనుకగా సారంగమున ప్రవేశించెను. ఆ సారంగము మార్గమంతయు దుమ్ముచే, రాళ్ళచే నిండి యుండెను. రాళ్ళు, మట్టిపెళ్ళలు అప్పుడప్పుడు పైని పడుచుండెను. మోకాళ్ళను చేతులను క్రింద నానించి వారు మెల్లగా ప్రాకిపోవుచుండిరి. ఊపిరి పీల్చుకొనుటకు గూడ చాల కష్టముగా నుండెను.

అట్లు వారు చాలదూరము ప్రాకిపోయిరి. పైన గస్తీ తిరుగుచున్న కావలిభటుడు ఆ సమయమున సారంగము పైభాగమున నడచుట సంభవించెను. అహో! దైవయోగ మేమనవచ్చును! అతడు నడచు ప్రదేశమున భూమిపై నివట్టు అంతతంత మాత్రముగా నుండెను. పట్టుసడలి ఆతడు సారంగములోని వారిపై పడెను.

అయ్యాది కష్టములు దూయుటకు అనువైన ప్రదేశము కాదు. రంగరాయలను, కుటుంబమును మఱియొక చోటికి త్వరగా తీసికొని పోవుటకును వలనుకాదు. అంతలో కావలి

వాడు మొఱపెట్టుచు అఱచుట కారంభించెను. తక్కిన కావలి వాండ్రందఱును ఆతని మొఱవిని పరుగెత్తుకొని వచ్చిరి. రంగరాయమాచులను వారందఱు జగ్గరాజు వద్దకు గొనిపోయిరి.

# 17. సందేహము

"వెలిపెట్టిరే బాడబులు పగాశరుపుట్టి దాశకన్యాకేళి తప్పుఁజేసి"

—మనుచరిత్ర.

అది సంధ్యాకాలము. పిల్లతెమ్మెరలు త్రోపుడులు పెట్టుకొనుచు వాహ్యాళి బయలువెడలెను. తంజావూరు రాజ సౌధమునవిజయ వీణపై అరమోడ్పు కనుదోయితో గాంధర్వ గానము ఆలాపన చేయుచుండెను. ఆ మధురపాటల నిస్వన మాధురీస్రవంతులు మనస్సును పరవశముచేయు చుండెను. అందువలననే కాబోలు! దాపున గూర్చుండి ఆలకించుచున్న రఘునాథరాయ రామదేవరాయ ప్రభువులు చిత్ర ప్రతిమల విధాన చూపట్టు చుండిరి.

ఒక దాసి హడావుడిగా ప్రవేశించి 'రఘునాథరాయ ప్రభూ! తమకొఱకు యాచమనాయుని యొద్దనుండి యొక రాయబారి వచ్చినాడు. చాల ఆతురతతో ప్రయాణముచేసి వచ్చినవాడుగా నున్నాడు. ఒడలిపైని నవక్షతములనుండి రక్తము స్రవించుచున్నది.' అని చెప్పెను.

వారు ముగ్గురు ఒక్కమాఱుగా లేచిరి.

రఘు : దాసీ! సత్వరము ఆతనిని తీసికొనిరమ్ము. ఆయనను

ఇటకు బంపి నీవు వెంటనే పోయి రాజసైన్యాని తీసికొని రమ్ము.

యాచమనాయని ప్రత్యేక భటవర్గమునకు చెరిన యాయోఘుడు ఆ మూవురకు నమస్కరించి "ప్రభూ! యాచమనాయ ప్రభువు శ్రీరంగదేవరాయల మహారాజులుం గారిని సారంగము ద్వారా తప్పించుటకై చేసిన ప్రయత్నము విఫలమైనది.

అప్పటినుండి జగ్గరాజు ఆ మహారాజును చీకటి కొట్టులో బైదు చేసి చాలహింసించుచున్నట్లు తెలియుచున్నది." అని చెప్పెను.

రామదేవ : హా! హాతవిధీ! ఎట్టివానికి ఎట్టిగతి కల్పించితివి!

విజయ : ఘోరదుష్కర్మము. మహారాజా! ఇది విచారమునకు సమయము కాదు.

రఘు : గతమును చింతించి ప్రయోజనము లేదు. జగ్గరాజు పాపము పండు సమయము మాసన్నమైనది. తరువాత వృత్తాంతమును చెప్పుము.

రాయబా : ప్రభూ! మహారాజులుం గారిని చంద్రగిరి కోటలో బంధించినట్లు వార్త వచ్చినది. జగ్గరాజు మహారాజుల వారిని యేమి చేయనున్నాడో యను భయానుమానములచే యాచమనాయక ప్రభువు శీఘ్రకాలముననే రంగరాయల వారి బంధవిముక్తికై పరిపరి విధముల నాలోచించు చున్నారు.

రఘు : యాచమనాయని రాజభక్తికి జోహారులు. మరి నీ గాయములకు కారణమేమి?

రాయ : తుండీరమండలారణ్య మార్గమున వచ్చుచుండగా అయిదుగురు ఆశ్వికభటులు సన్నిహగించి, ఈ మార్గమున ఎవ్వరును పోరాదని శాసించిరి. వారి అడ్డగింపును లెక్కసేయక పోరాడి, తప్పించుకొని అతిశీఘ్రగతిని ఇటకువచ్చితిని. ఆ గాయము లొక లెక్కలోనివిగావు. అంతలో రాజవైద్యుడువచ్చి రాయబారికి చక్కని చికిత్సచేసి గాయములకు కట్టుకట్టిపోయెను.

రఘు : రాయబారీ! కొంచెముసేపు విశ్రమింపుము. మనము తరువాత మాటలాడుదుము.

రాయ : అవసరములేదు ప్రభూ! ఉదయముననే మరల ప్రయాణమై పోవలసియున్నది.

రఘు : మరి, ఇంకేమైన విశేషములున్నవా?

రాయ : రామదేవరాయలవారిని పట్టుటకును తిరిగి బంధించుటకును వారు అనేక ప్రయత్నములు చేయుచున్నట్లు తెలియుచున్నది. మాకరాజు రావెల వేంకటపతి ఆపనికై నియోగింపబడినాడట. ఆవిషయమును మీరు చాల అప్రమత్తులరై యుండవలయును. వారిరువురు శకుని దుశ్శాసనులవంటివారు.

రామదేవ : యాచమనాయనితో మా క్షేమమున కెట్టి కొఱంతయు గలుగకుండునట్లు జాగ్రత్తగా సంచరించెద మని తెలుపుము. మాకరాజుగాని రావెల వెంకుగాని

మమ్మేమియు జేయజాలరు. యాచమనాయని శ్రద్ధా భక్తులు ధైర్యసాహసములు మహారాజును రక్షించుటకు వినియోగింపవలసినదిగా ప్రార్థించితి నని తెలుపుము.

రాయబారి : వారి పన్నాగము చాల భయంకరమైనది. యువ రాజును బంధించి, మొత్తము రాజవంశమును నాశనము చేయజూచుచున్నారు. మామూలు జాగ్రత్తలోనున్న జాలదు. విశేషించి మిమ్ములను మీరు రక్షించుకొనుచుండవలయును.

రఘు : యాచమనాయనితో యువరాజువిషయమై ఎట్టి యాందోళన నందవలదని చెప్పుము. ఆ బాధ్యత నాది. మహారాజుల బంధవిముక్తికై ఆతడుచేయు ప్రయత్నములు సఫలీకృతములగుగాక! మఱి సైన్యసమాయత్త కార్యమెట్లున్నది ?

రాయ : సైన్యములను సమకూర్చుచునే యున్నారు. కొన్నింటిని కుంభకోణము పంపుచున్నారు. నాలు గయిదు దినములలో సైన్యముల నన్నింటిని కుంభ కోణము జేర్పగలరు.

రఘు : మంచిది.

రాయ : ప్రభూ ! తెల్లవారు జాముననే వెళ్ళివచ్చెదను. వెంటనే రావలసినదని మా ప్రభువులవారి ఆజ్ఞ.

రఘు : అట్లేచేయుము. మాభటుల నిరువురి నీతో పంపెదను. రాయబారి ముపృరకును నమస్కరించి వెడలిపోయెను.

రఘునాథరాయలు రాయబారిని పంపు ఏర్పాట్లు స్వయముగా చేయదలచి వెడలిపోవును.

రామదేవ: విజయా! నాకిచట మనస్సు మనస్సులో లేదు. యాచమనాయని యొద్దకుపోయి నాతండ్రి గారిని విడిపించు ప్రయత్నములో పాల్గొనవలయుననియున్నది.

విజయ: మఱి రాయబారి అరీతిగా చెప్పుచున్నాడుగదా?

రామదేవ: అదియు నిజమే. తలిదండ్రులు లెంతటి హింసల పాలగుచున్నారో! యేమియు తోచకున్నది.

విజయ: తాతగారగు తుండీర మండలాధిపతి మనపై కత్తి గట్టుట ఆశ్చర్యము గల్గించుచున్నది. ఎప్పటి పగలో మనస్సున పెట్టుకొని, అల్లుడని కూతురని లేక ఎంత యకార్యము చేయుచున్నాడు! 'నేనొకమాఱు ఆయన యొద్దకు వెళ్ళిన బాగుగా నుండునా?' అని ఆలోచించుచున్నాను.

రామదేవ: ప్రయోజనముండదని నాయుద్దేశము. అతడు బంధుప్రేమలు త్రెంచివేసికొనినాడు. తంజావూరు రాజ్యమున సగము భాగము తీసికొనుటకును - యుద్ధమున జగ్గరాజు పక్షమున పోరాడుటకును అతడు యేర్పాటు చేసికొనినట్లు విన్నాను. అట్టివాడు ఇపుడు వెనుకకురాడు. రాజ్యకాంక్ష అమోఘమైనది. దాని ముందు అల్లుడు కనబడడు. కూతురు కనబడదు. అప్త మిత్రులు కనబడరు.

విజయ: మాతల్లిగారు కూడ ఇట్లె చెప్పినారు.

రామదేవ : విజయవిలాసము ప్రతిష్ఠ నిలబెట్టుకోలేని తా వొకటి నేటకి కాన్పించుచున్నది.

విజయ : విజయవిలాసము ప్రతిష్ఠ గాంచలేని తావే లేదుగదా! అది మాగురువుగారు రచించుచున్న ఉత్తమకావ్యము.

రామదేవ : ఓహో! అందు ఉలూపిదేవి తన్ను పరిణయమాడ వలసినదని అర్జునుని ప్రార్థించునుగదా ?

విజయ : అర్జునుడు-కుల భేదములు వంశ భేదములు మొదలగు వాని అభ్యంతరములుగా చెప్పి, మొదట ఆమె కోర్కెను నిరాకరించును.

రామదేవ : తరువాత !

విజయ : అంగీకరించి ఆమెను పాణిగ్రహణము చేసికొనును.

రామదేవ : ఒక్కమారు వేంకటకవిని పిలిపించి విజయ విలాసము వినవలయును.

విజయ : రేపు పిలిపింతమా ?

రామదేవ : వలదు. మాతండ్రిగారు బంధవిముక్తి అయిన తరువాత పిలిపింతము.

---

# 18· భయంకర దృశ్యము

"శక్తుకై యస్యహితార్థ ఘాతుక జనుల్ దైత్యుల్" —భర్తృహరి

యాచమనాయుడు దేనిని గురించియో దీర్ఘముగా నాలోచించుచు ఒక భటుని బిలిచి "నీవు శీఘ్రముగా పోయి రామరాయుని పిలుచుకొనిరమ్ము" అని ఆజ్ఞాపించెను.

రామారాయడు వచ్చి యాచమనాయని ఎదుట నిలబడి యుండెను.

యాచమ : రామారాయా! మనమిపుడొక సాహసకార్యము చేయవలసి యున్నది. నీవు సమర్థుడవని రాజభక్తిపరుడవని విశ్వసించి నిన్నీ పనికై వినియోగించుచున్నాను.

రామా : చిత్తము ప్రభూ!

యాచమ : జగ్గరాజు తన పక్షమును బలపఱుచుకొనుటకై మండలాధిపతులయొద్దకు వెళ్ళినాడని వింటిని.

రామా : అది నిక్కవము. ఆ వార్త తెచ్చినది నేనే ప్రభూ!

యాచమ : మహారాజులుంగారు చంద్రగిరి దుర్గము నందు బంధితులై యున్నారు.

రామా : మహారాజులుంగారిని జగ్గరాజు పెట్టుచున్న హింసలు వర్ణించుట కలవిగావని వింటిని.

యాచమ : మంచిది. అది యట్లుండనిమ్ము. మన ప్రత్యేక భటసేన యంతయు ఇచటనే యున్నదా?

రామా : చిత్తము ప్రభూ!

యాచమ : ఇపుడు నాకొక యుపాయము తోచుచున్నది. జగ్గరాజు రాయవేలూరి కోటలో లేడు. చంద్రగిరి దుర్గమునందు స్వల్పసేన మాత్రమే గలదని వింటిని.

రామా : మహారాజులుంగారిని రక్షించుటకు ఇదిమంచియదను

యాచమ : నేను ఆలోచించుచున్నదియు నదియె. మన ప్రత్యేక సేననంతయు తీసికొని, మఱి అయిదువందల యదనపు సేనను గూడ గ్రహించి, ఈసేనకంతకు నీవు

నాయకుడవుగా పోయి చంద్రగిరి కోటను ముట్టడింపుము. అచట గల స్వల్ప సేనను సంహరించి మహారాజులుంగారిని కుటుంబసహితముగా నిచటికి సురక్షితముగా తీసికొని రమ్ము. మఱియొక మాట. కోట ముట్టడి అర్ధరాత్రమున నకస్మాత్తుగా జరుగుట మంచిది. మఱికొంత సేనను వెనుక పంపెద. పరిసరములయందు గుప్తముగానుంచును. అవసరమగుచో మీరు దానినిగూడ నుపయోగించుకొనవచ్చును.

రామా : అట్లె చేయగలము ప్రభూ!

యాచమ : అసలు నేనే బయలుదేరుదుమనుకొంటిని. నా సేనలతో నేను బయలుదేరితినా జగ్గరాజు సులభముగా గ్రహింపగలడు. అతడు తన పెద్దసేనతో వచ్చి మనపై బడును. అట్టిదుష్ఫలమును మన మెవ్వరమును ఆహ్వానింపరాదు.

రామా : చిత్తము ప్రభూ! గొప్పసేనగలవారిని కొద్ది సేనగలవారు బహిరంగముగా ఎదుర్కొనుట సర్వనాశనమునకే.

యాచమ : ఔను నీవు చేయబోవుపని ఎంత కష్టసాధ్యమైనదో ఎంత గౌరవప్రదమైనదో నీవు ఊహించుకొనియే యుందువనుకొందును.

రామా : చిత్తము ప్రభూ!

యాచమ : ఈ పనిని నీవు సాధించుకొని వచ్చినచో నీకు నా పెనుమాడి దుర్గమునే బహుమానముగా నీయగలను.

రామా : ప్రభూ! క్షమింపుడు. నా రాజభక్తిని విక్రయింప

జాలను. మహారాజులుంగారి బంధవిముక్తికై ప్రాణ రక్షణమునకై వలయుచో నా యసువుల ధారవోయ గలను. మీ దుర్గము బహుమానముగా నిచ్చుమాట ఇక నెత్తవలదు. ప్రభూ! ఈ మహాంధ్ర సామ్రాజ్య సంరక్షణము మన యందఱ కర్తవ్యము.

యాచమ: సరియె, నీయిష్టము. మీరు బయలుదేరిపొండు.

రామారాయని సేనయంతయు పదిభాగములుగా చీలి చంద్రగిరి దుర్గాభిముఖమై పోవుచుండెను. చూచుటకు వారు సాధారణ యువకులుగనే యుండిరి. ఆయుధాదులను గుప్త పఱచికొని ప్రయాణము చేయుచుండిరి. వారు చంద్రగిరి దుర్గ పరిసరములను జేరి, కొండలను ఆరణ్యానీలను ఆశ్రయించి చీకటిపడు పర్యంతము వేచియుండిరి.

అర్ధరాత్రమున — మేఘాడంబరము అతిశయించెను. ఉరుములకు మెఱపులకు అంతులేకుండెను. ఆసమయమున పదిజట్లుగా నేర్పడిన రామారాయని భటులు బయలుదేఱి చంద్రగిరికోటను ముట్టడించిరి. కావలివాండ్రను చంపివేసిరి. ద్వారములను ఛేదించిరి. లోని రక్షకసైన్యములపైబడి దునుమాడిరి. హతశేషులైనవారు దిగ్భ్రాంతి కన్నులగ్రమ్మ నల్దిక్కులకు బారిపోయిరి. తెల్లవారునప్పటికి కోటయంతయు యువక భట స్వాధీనములోనుండెను. వారు మహారాజులుంగారికిబంధ విముక్తిగల్పించి రాజసౌధములో ప్రవేశపెట్టిరి. యువకభటు లందఱును ఉత్సాహపరులైయుండిరి.

రామారాయడు సంగతి సందర్భములను సమన్వయ

పట్టుచుకొనుచుండెను. తమసేన దాదాపుగా మూడువంతులు నశించిపోయినది. మిగిలిన స్వల్పసేనతో మహారాజులుంగారిని తీసికొనిపోవుట శ్రేయస్కరముగాదు. పరిసరములయందు కాపలా పెట్టియుంతునన్న సేన ఎందును కాన్పింపలేదు. జగ్గరాజు సమీప దుర్గములందు ఎచటనులేదు. అపుడాతడు యాచమనాయనికి ఈ క్రిందివిధముగా లేఖవ్రాసెను.

ప్రభూ ! తమ యాజ్ఞ ప్రకారము చంద్రగిరి కోటను ముట్టడించి, జయించి వశపఱచుకొంటిమి. మహారాజుల వారిని శ్రీవారి కుటుంబమును రాజసౌధమునం దుంచితిమి. మేము తెచ్చిన సేనలు మూడువంతులు నాశనమైనవి. మిగిలిన స్వల్ప సేనతో మహారాజులుం గారిని తీసికొని వచ్చుట క్షేమకరము గాదని భావించితిమి. తమరు పంపెదమన్న సేన మాకెచటను గాన్పింపలేదు. తమరు దయయుంచి వలయు సేనను జగ్గరాజు రాకపూర్వమే పంపవలయును. మీరు పంపు సేనలతో మహారాజును అచటికి తీసికొని రాగలను.

దివ్యచిత్తమునకు తేవలయును.
భృత్యానుభృత్యుడు
రామరాయుడు.

లేఖను భటునకిచ్చి పంపెను.

ఆనాటిరాత్రి రక్షకభటులు కోటరక్షణమున మిక్కిలి అప్రమత్తులై యుండిరి. రామ రాయడు మహారాజులవారికి యువరాజు క్షేమమును యుద్ధ ప్రయత్నములు వైఖరి-సామంతుల స్థితిగతులు లోనగు సర్వవిషయము లను ఎరింగించు

చుండెను. మహారాజు అవియెల్ల విని "రామారాయా! మీ ఋణము నే నెన్నటికిని తీర్చుకొనజాలను. యాచమనాయుడు మూర్తీభవించిన రాజభక్తియే. జగ్గరాజు బంధమునుండి విడివడి ఒక్కమారు మిమ్ముల నందరను సత్కరింప గల్గుచో నాజన్మము ధన్యమైనట్లే భావించెదను" అని వచించెను. రామారాయుడు, మహాప్రభూ! జగ్గరాజు బంధములనుండి మీరు విడివడియే యున్నారుకదా!

రంగ : కాదు నాయనా కాదు. యాచమనాయని చేరునంత వఱకు నేనట్లు భావింపలేను. జగ్గరాజు సంగతి మీకు తెలియదు. అత డెంతటి మాయావియో మీ రెఱుంగరు. చంద్రగిరికోట వృత్తాంతము అతని కీపాటికే తెలిసియుండును. దూరమున నుండనిమ్ముసమీపమున నుండనిమ్ము. అత డెప్పటివార్తలు అపుడే తెలిసికొనగలడు. అతడు వచ్చి పడుచో మన కేమిదిక్కు.

రామా : మహాప్రభో! సేనలు త్వరలో పంపవలయునని యాచమనాయకులవారికి ఉత్తరము వ్రాసితి.

రంగ : ప్రయోజనముండునని తలంపను — అదిగో — వినుము — ఆ శబ్దము లేమి?

రామా : (విని) గుఱ్ఱముల డెక్కల ధ్వనులవలె నున్నవి.

రంగ : కొంప మునిగినది.

ఒక భటుడువచ్చి రామారాయని కిట్లు చెప్పెను. "మహాశయా! మన కోటవైపునకు పెద్దసేన వచ్చుచున్నది—సమీపించుచున్నది."

రామా : అందఱు జాగ్రత్తగా నుండుడు. మహాప్రభూ !
సెలవు. మఱల వచ్చెదను.

రంగరాయుల మహారాజులు నిశ్చలముగా గూర్చుండి యుండిరి.

వచ్చునది జగ్గరాజు సైన్యము. మండలాధిపతులను జూచి ఆతడు వెనుదిరిగి వచ్చుచుండగా ఈ వార్త త్రోవలో యాచమనాయని గుప్తసైన్యము వానికందబడియె. ఆ సైన్యమును జగ్గరాజు మహాసేన రూపుమాపెను. అంతనది చంద్రగిరికోటను శీఘ్రముగా చేరి అవలీలగా దుర్గమున ప్రవేశించెను. యువక భటుల నందఱను ఒక్కని నైన విడక చిత్రవధ చేసినది.

రంగరాయని ఎప్పటియట్ల బంధించిరి.

జగ్గరాజు పండ్లు పటపట గొరుకుచు "ఈ యాచమనాయని వలన నాకు మనశ్శాంతి లేకుండ బోవుచున్నది. రంగరాయలు బ్రదికియున్నంత వఱకును ఇట్టి ప్రయత్నములే జరుగుచుండును. అదియుంగాక రంగరాయలు బ్రదికియున్నంత వఱకును యాచమనాయడు మఱియొకని సేవింపడు. ఇట్టి రాజభక్తులను స్వపక్షమునకు త్రిప్పుకొన వలయునన్నను రంగరాయలు మరణించుటయే యుత్తమము. ఇక ఆలోచింప వలసిన పనిలేదు. ఈ రాత్రి ఈతనిని సకుటుంబముగా కడ తేర్చి వేయవలయును. ఇదియే సుఖమార్గము, అని నిశ్చయించుకొనెను.

ఆనాడు ప్రొద్దుకూకెను. గాఢాంధకారము లప్పుడె

దశదిశల నావరించెను. ప్రొద్దుపోయిన కొలదియు నా రాత్రి కాళ రాత్రి యగుచుండెను. ప్రాణికోటి యంతయు నిద్రా ముద్రితమై యుండెను. వృక్షములు జడలు విరియబోసికొనిన దయ్యముల వలె భయంకరములాయెను.

ఆ సమయమున జగ్గరాజు తన్ను దా నెఱుంగని చిత్తముతో, చింతనిప్పులవలె మండుచున్న కన్నులతో రాక్షసాకృతి వహించి, రంగరాయలున్న ప్రదేశము వెదకికొనుచు పోవుచుండెను. పాపము—రంగరాయలు నిద్రించుచుండెను. జగ్గరాయలు ఆ మహాప్రభువును లేపి, ఇట్లనియె.

"ఓయీ! రంగరాయా! నీవు చేయించు ఆగడములు మితిమీఱి పోవుచున్నవి. నేటితో నీ కాలము చెల్లినది. నీ కత్తితో నీవుపొడుచుకొని మరణింతువా! ఆపని మఱియొకరు చేయవలయునా! చెప్పుము. ఆలస్యము చేయక వెంటనే ప్రత్యుత్తర మిమ్ము."

రంగరాయలు జగ్గరాజు భీకరాకృతిని క్రూరవాక్యములను విని యినుమంతయు చలింపలేదు. భయపడను లేదు. ధైర్యము విడువక "జగ్గరాజా! ఆపని నేనే పూరిచేసికొన గలను. నీకిష్టమగుచో ఒక్కవరముమాత్రము దయచేయుము. నాకన్నులను శాశ్వతముగా మూయులోపల నా యాలుబిడ్డలను ఒక్కమారు చూచుకొన నిమ్ము." అని పలికెను.

భార్యయు బిడ్డలును రంగరాయలవారి యొద్దకు వచ్చి నిలుచుండిరి. వారలతో రంగరాయలు శాంతముగా నిట్లు చెప్పెను. "భగవదనుగ్రహమువలన ఇన్నాళ్లు మనము కలసి

యుంటిమి. ఇపుడు విడిపోవుచున్నాము. సంయోగ వియోగ ములు ప్రాణులకు సహజములు. దీనికై మీరు వగచుట ఉచితము కాదు. ఈదినము కాకపోయినను రేపైనను మరణము తప్పదు.

నేను ఎవ్వరికిని ఎట్టి అపకారమును జేసియుండలేదు. అన్యాయముగా నొకరి సొత్తును ఆశింపలేదు. చావన్న నాకు లేశమాత్రము భయములేదు." అని పలికెను.

ఓబలదేవి "ప్రభూ! తమ చిత్తము వచ్చినట్లు కానిండు. నాకీచివరి యుపకారము చేయుడు "నన్ను శత్రువుల కప్పగించక మీఖడ్గముతోడనే నరికివేయుడు". అని పలికెను.

రంగారాయలు ఒక్కక్షణము కన్నులు మూసికొని ధ్యాన తత్పరుడై ఆమెవక్షస్థలమున గ్రుడిచ్చెను. ఇరువురు పుత్రులను ఒకపుత్రికను అట్లే గావించెను.

మరియొక యాడుబిడ్డమాత్రము గలదు. ఆమె యనిన రంగరాయలకు మిక్కిలి ప్రేమ. ఆమె ఆ దృశ్యమంతయు చూచుచునే యుండెను.

రంగరాయలు ఆబిడ్డదగ్గరకు పోయెను. విచార దృక్కులతో ఆ బిడ్డ చంద్రదివంక చూచెను. శ్రీరంగరాయలు గిఱ్ఱున వెనుదిరిగి చంద్రాయుధముతో గాఢముగా తన వక్షస్థలమున పొడిచికొనెను. ఈ దృశ్యమంతయు జగ్గరాజు కనులార వీక్షించుచు అచటనే నిలబడియుండెను.

అతడు మానవుడా — దానవుడా

అతనిది గుండియా — గుండ్రాయియా,

అటు ఒకక్షణకాలముండి రాయలు చంపక విడిచిన చిన్నిబిడ్డయొద్దకేగి—ఆపాపాత్ముఁడు—తనఖడ్గముతో ఆబిడ్డను కూడ పొడిచివైచెను.

నరకలోకమందైనను అతనికి తావుదొఱకునా?

# 19. యుద్ధము

"వివిధ వవద్యాయు ద్వీప నానా జయశ్రీ వధూటీ సమాశ్లిష్ట భుజుఁడు"—
శ్రీనాథుడు

జగ్గరాజుచేసిన దుష్కృత్యము దేశమంతయు క్షణములో వ్యాపించెను. ఆవార్త వినిన మండలాధిపతులకు శ్రీరంగరాయల పక్షమునెడ భక్త్యభిమానములు కలిగెను. దండనాయకులు, రాజపురుషులు, భృత్యులు కోపోద్దీపితులై జగ్గరాజును నాశనము చేయవలయునని నిశ్చయించుకొనిరి శ్రీరంగరాయ ధర్మరాజును అట్లు హత్యచేసిన పాపాత్ముఁడు మనలను మాత్రము బ్రతుకనిచ్చునా యని ప్రజలు వాపోవు చుండిరి. వీరపురుషులు పెక్కండ్రు యాచమనాయనిపక్షమున జేరిరి. సామంతప్రభువు లనేకులు జగ్గరాజుపక్షము వీడి రామదేవరాయలవారిని సామ్రాట్టునిఁజేయ సంకల్పించుకొని, సేనను సమకూర్చుటకయి దండనాయకుల కాజ్ఞలిచ్చుచుండిరి.

జగ్గరాజును పెక్కు మాయోపాయములు పన్ని యుద్ధ ప్రయత్నమునందేమరక తనపక్షపు మండలాధిపతులు తిరిగి పోకుండ జూచుకొనుచుండెను.

జగ్గరాజుసేనలు ఏబదివేలుదాక గలవు. యాచమనాయని సేనలు నలుబదివేలవఱకు గలవు. కాని అధిక సైన్య సంపత్తిగల తుండీర మండలాధిపతి కృష్ణప్ప నాయకుడును పాండ్యమండలాధిపతి వీరప్పనాయకుడును జగ్గరాజునకు పెట్టని కోటవలె నుండిరి.

జగ్గరాజు సైన్యములును కృష్ణప్పనాయని సైన్యములును కలసికొని కుంభకోణము చేరుచున్న యాచమనాయని సేనలకు పెక్కు చిక్కులు కల్పించుచుండెను. ఆ పరిస్థితు లన్నియు గనిపెట్టి యాచమనాయకుడు తమ సైన్యములను తంజావూరు సైన్యములతో గలుపుటకు సర్వప్రయత్నములు చేయుచుండెను. విజృంభించుచున్న జగ్గరాజు తుండీరమండలాధిపతుల సేనలు యాచమనాయనిసేనలను తంజావూరుసేనలను కలియనీయకుండ నడ్డుపెట్టుచుండెను.

యాచమనాయడు తన సేనల నన్నింటిని భాగములుగాజేసి, జగ్గరాజు — తుండీర మండలాధిపతుల సేనలు పాండ్య మండలాధిపతి సేనలతో గలియకుండ నడ్డుపెట్టుచుండెను. అట్లు పరస్పర సేనావాహినుల నడ్డగించుకొనుటతో ఉభయపక్షములవారికిని అచట నచట యుద్ధములు ప్రారంభమయ్యెను. ఆ సంరంభ మంతయు దిలకించి యాచమనాయడు ఇట్లు తలంచెను. "ఇట జగ్గరాజు సేనలకు తుండీర పాండ్య మండలాధిపతుల సేనాసాహాయ్యమున స్థాన బలము పుష్కలముగా జిక్కినది. రఘునాధరాయల సేనలతో గలిసికొననిదే నా సేనల కట్టిబలిమి చిక్కుట దుర్ఘటము. ఎట్లైనను

నా సేనలను రఘునాథరాయల సేనలతో సంధింప బ్రయత్నిం చెద" అని నిశ్చయించుకొని—తన సేనల కట్లాజ్ఞాపించెను.

యాచమనాయని సేనలు క్రమక్రమముగా ముందుకు సాగిపోవుచుండెను. అది చూచి జగ్గరాజు అది రఘునాథ రాయల సేనలతో సంధింప గలవని మిగుల నాతురతతో పాలెంబు కోటపతియును రామదేవరాయల మేనమామయు అగు యతిరాజును పిలిచి యిట్లనియె. "మహామండలాధిపా! ధర్మబుద్ధితో నీవు నీ మేనల్లుని పక్షము విడిచి నాపక్షమున పోరాడుచున్నందులకు కృతజ్ఞుడను. నీవు ఈ వలందుల పటాల మును దీసికొని పాండ్యమండలాధి పతియగు మధుర వీరప్ప నాయకుని సమీపించి నా మాటలుగా ఇట్లు చెప్పుము. మహానుభావా! యాచమనాయడు రఘునాథరాయల సేనలతో సంధింప సమకట్టినాడు. అతడు సఫలీకృతుడగుచో మనపని వట్టిదే. అందుచే టయతో తమరు ఈ యొలందుల పటాలము సాయమువ కావేరీనదీ యానకట్టను బ్రద్దలు కొట్టించి నాశనము గావింపుడు." అని చెప్పెను.

మండలాధిపతియగు యతిరాజు మధుర వీరప్ప నాయ కుని యొద్దకు పోవుచుండెను. యాచమనాయని సేనలు మధ్య మార్గమున తారసిల్లి వింతగానున్న ఒలందుల సేనలచే నాకర్షింపబడి, యతిరాజు సేనలను అటకాయించి ఆ పటాల మును, నాయకుడైన యతిరాజును బందీలుగా జేయ యాచమ నాయని యొద్ద జేర్చిరి.

యాచమనాయడు యతిరాజుతో—"అయ్యా! ధర్మపక్ష

మైన మేనల్లునిపక్షము వీడి రంగరాయ హంతకుడైన జగ్గరాజు నెట్లు చేరితివయ్యా ! ఈ పటాలము యెక్కడిది" అని పలికెను.

యతిరాజు : ధర్మపక్ష మేదియో నాకును దెలియును. ఇచ్చిన మాట తీసివేయలేక. విధిలేక అటు చేరవలసివచ్చినది.

యాచమ : ఈ పటాలమెక్కడిది ? ఎచటికి తీసికొనిపోవు చున్నావు.

యతిరాజు : జగ్గరాజు ఆజ్ఞానుసారముగా కావేరినదిఆనకట్టను నాశనముచేయుటకై మధుర వీరప్పనాయకుని యొద్దకు తీసికొని పోవుచున్నాను.

యాచమనాయడు సర్వము గ్రహించెను. తన సేనలకు ఆరాత్రియె యానకట్టను దాటి తంజావూరు సేనలను గలియ వలసినదిగా ఆజ్ఞాపించి యతిరాజును ఇంగ్లీషువారి పటాలమును బంధించి యుండెను.

ఆ రాత్రి యాచమనాయని సేనలు తంజావూరు సేనలను సంధింపగల్గినవి. జగ్గరాజుసేనలో గొప్పకలవరముపుట్టెను. యాచమనాయని సేనలు ఏవ్యూహము పన్నుచున్నవో వారికి సరిగా తెలియరాకుండెను. అపుడు స్వయముగా జగ్గరాజు మధుర వీరప్పయొద్దకుబోయి ఆతని ప్రోత్సహించి కావేరి నది యానకట్టను బ్రద్దలు కొట్టించెను.

శత్రుపక్షమువారు ఎన్ని ప్రయత్నములు చేసినను యాచమనాయని సేనలను రఘునాథరాయల సేనలను సంధింపగల్గినవి. ఉభయపక్ష సేనలకును కావేరీతీరమున గల "తోపూరు" గ్రామమున ఘోరమైన సంగ్రామము జరిగెను.

ఆయుద్ధములో యాచమనాయుడు, రఘునాథరాయలు రామదేవరాయలు చూపిన శౌర్యము వర్ణనాతీతము. రామదేవరాయలు జగ్గరాజును వధింప సమకట్టి యాతనికై వెదకుచుండెను. ఒకచో వారిరువురు తారసిల్లిరి. రామదేవరాయలు "దుర్మార్గా! ద్రోహీ! రాజహంతకా! నిలునిలు"మని హెచ్చరించుచు జగ్గరాజుపైగవిసె ఆతడును వెనుదీయక రామదేవరాయల నెదుర్కొనెను. బిరుదులుపలుకుకొనుచు వారిరివురు పెద్దకాలము పోరిరి. తుదకు రామదేవరాయల ధాటికాగలేక జగ్గరాజు వెనుదీయుచుండెను. అంత రఘునాథరాయల యీటెపటాలము జగ్గరాజుపై గవిసెను. అ సమయమున రామదేవరాయలు జగ్గరాజుపైబడి వాని శిరస్సు ఖండించె ఈటెపటాలము జగ్గరాజు బంధువులను వాని సైన్యములను పొడిచివైచి నాశనముగావించెను.

ఒకచో రఘునాథరాయల సేనలును మధుర వీరప్ప నాయని సేనలను యుద్ధమునకు దలపడెను. ఆదృశ్యము పూర్వ పశ్చిమసముద్రములు ఎదుర్కొనినట్లుండెను. మొదట ఫిరంగులతోడను తుపాకులతోడను యుద్ధము ప్రారంభమాయెను. అనంతరము రఘునాథరాయల యాశ్వికసైన్యము అర్ధచంద్రాకృతిగా నేర్పడి ముందుకు చొచ్చుకొనిపోయి మధురసైన్యమును ధ్వంసము చేయుచుండెను. వెంటనే పదాతి వర్గము వారు పైబడి మధుర సైన్యమును ఊచకోత కోయుచుండిరి.

జగ్గరాయని ప్రేరణచే వీరప్పనాయనిచే నాశనముగావింపబడిన కావేరినది యానకట్ట మధుర సైనికుల కపాల

ములతో పూరింపబడి రక్తముతో నదుకబడి పునర్నిర్మాణము గావింపబడెనా యన్నట్లు భాసించుచుండెను.

మధుర వీరప్పనాయని స్థితి దుర్భరముగా నుండెను. అతనికి తన రాజ్యముండునో ఊడునో యను భీతి జనించెను. రఘునాథాభ్యుదయ నాటకమున వర్ణింపబడిన "కన్నావర్ణనము" ఇట్లు చెప్పుచున్నది.

తనవద్ది దొరలెల్ల తనుడించిపాఱ
నింతుల నెడబాసి నిలు చూఱయిచ్చి
సంతరించిన బొక్కసము విడిబుచ్చి
తురిగంబు డిగ్గి కైదువ పాఱవైచి
విఱిగి పాఱదొడంగె వీరపనేండు.

పాండ్యరాజును ఇట్టి దీనస్థితికి దెచ్చిరఘునాథరాయలు అఖండ జయలక్ష్మిని చేబట్టె. వీరప్పనాయుడు బంధింపబడియె.

తుండీర మండలాధిపతితోడ యాచమనాయడు చేసిన యుద్ధము అప్రతిహతము. అనుపమానము. అమ్మహా యుద్ధమున యాచమనాయని సేనలను తుండీరమండలాధిపుని సేనలు పరస్పర జయకాంక్షతో హోరాహోరి పోరుచుండెను. యాచమనాయని సేనలధాటికి కృష్ణప్పసేనలు ఆగజాలక వెనువెనుకకు బోజొచ్చెను. యాచమనాయడొక వో కృష్ణప్ప నాయని దాకి భంగపరచెను. కోనయూపిరితో కృష్ణప్ప నాయకుడు గుఱ్ఱముపైనుండి పడిపోయెను. రఘునాథరాయల మామగారను తలంపున యాచమనాయడాతనిని ఖండింపక బంధింపుడని తన భటుల కాజ్ఞయిచ్చెను.

మాకరాజు రావెల వేంకటపతిలోనైనవారు యాచమనాయని ధాటి కాగలేక తప్పించుకొని పాఱిపోయిరి. హతశేషులైన శత్రునాయకు లెల్లరును రామదేవరాయల శరణు వేడికొని బ్రదుకు గాంచిరి.

## 20 అదృష్టము

"పెట్టిపదినములలోపల వట్టడవులకైన వచ్చు నానార్థంబుల్":—సుమతి

తంజావూరు రాజసౌధము దాపునగల విశాల రమణీయమైన యొక సౌధము యుద్ధమున వికలాంగు లైనవారికి క్షతాంగులైనవారికి చికిత్సా మందిరముగా నేర్పాటు చేయబడెను. అందు విజయ అత్యంత శ్రద్ధ తీసికొని ఉపచారములు చేయుచుండెను. ఆమె మాటలు అచటివారికి ఉత్సాహము కల్గించుచుండెను. ఆమె ఉపచారములచే వారు బాధలను మఱచి ఆనందించుచుండిరి.

అపుడామె యాచమనాయనిచే పట్టువడిన యతిరాజునకు ఉపచారము చేయుచుండెను. యతిరాజునకు రెండు మూడు ప్రబలములైన గాయములు తగిలినవి. విజయ ఉపచారవిశేషముచే అవి బాగుగా నయమైనవనియే చెప్పనగు.

ఎందువల్లననినచో యతిరాజు ఆమె మణికట్టువంక అతిమాత్రశ్రద్ధతో చూచుచుండెను. అది గ్రహించి, విజయ "మహాశయా! ఏల మణికట్టువైపు అట్టు ఊరకే చూచుచున్నావు." అని అడిగెను.

యతి : ఏమియు లేదు తల్లీ ! ఈ విచిత్ర సంఘటన లేమియు నా కర్థము కావుటలేదు.

విజ : ఏమి విచిత్రసంఘటనలు బాబూ ! నీ భావమేమియో బోధపడక యున్నది.

యతి : ఏమియు లేదమ్మా ! నా భావము నాకే బోధపడకున్నది. ఇక దానిని ఇతరులకు తెలుపుట ఎట్లు ? ఏదీ నీకుడిచేతి మణికట్టు ఒకపర్యాయము చూపెదవా?

విజయ : ఈ పచ్చను గుఱించియా—నీ వాలోచించునది !

యతి : ఔను. అందలి యక్షరములను చదువు తల్లీ !

విజయ : " కొండమ "

యతి : ఓహో ! ఇది యేమి ? మహాద్భుతము ! (అని లేచి కూర్చుండెను.)

విజయ : నీవు ప్రక్కపై నుండి రెండుదినముల పర్యంతము లేవగూడదని వైద్యులు చెప్పినారు.

యతి : తల్లీ ! వైద్యులను గంగలో కలియనిమ్ము. నా గాయములు నెత్తురు స్రవంతులు ప్రవహింపనిమ్ము. ఈ మహాద్భుతమును నన్ను అన్వయించుకొననిమ్ము.

విజయ : యేదియో " అద్భుతము అద్భుతము " అని మాటలాడుచున్నారు. అదేమియో నాకు తెలియకున్నది.

యతి : నీవయస్సెంత తల్లీ—నీ పేరు విజయగదా ?

విజయ : ఔను పదునాలుగు సంవత్సరములు—నాపేరు విజయయే.

యతి : పదునాలుగు సంవత్సరములా ! ఎంతచక్కగా సరిపోవుచున్నవి. ఐన పేరును సరిపెట్టుకొనుట ఎట్లు ?

విజయ : చక్కగా సరిపోవుట ఏమి! ఈ పచ్చయందలి పేరును గుఱించిన విశేష మొకటి కలదు. చెప్పమందువా?

యతి : ఏమి విశేషము తల్లీ! త్వరగా చెప్పుము. నేను అంతటి అదృష్టవంతుడనా?

విజయ : అపుడు మాతండ్రి రఘునాథరాయలు మిత్రునితో జెప్పుచుండగా విన్న వృత్తమును నీకు జెప్పెదను. పెనుగొండ కోటయందు శ్రీ వీర ప్రతాప వీర వేంకటపతి మహారాజులుంగారి దర్శనము చేసికొని రాచ కార్యములు చక్క పెట్టుకొని వచ్చుచున్నారట. అడవి త్రోవలో వారు వచ్చునపుడు - ఎక్కడనో నాకు బాగుగా గుర్తులేదు-చెంచుల గుడిసె యొకటి యున్నదట. అపుడు నేను రెండేండ్ల బాలికనట. చెంచెత ఎంత బుజ్జగించి ఓదార్చుచున్నను ఏడుపు మానక గోలచేయు చుంటినట. తండ్రిగా రది చూచి, మా మూలు చెంచు బిడ్డలకును నాకును గల భేద మరసి చెంచునాయకుని పిలిపించి ఈ బిడ్డ ఎవరిది యని ప్రశ్నించిరట. నేను చెంచెత చేతులలో నుండి విడిపించుకొని, మా తండ్రిగారి చేతులలోకి పోయి ఏడ్పు మానితినట.

యతి : ఇక జెప్ప నవసరము లేదు. అంతయు నా కర్థమగుచున్నది. అయినది. అయ్యో! మా తల్లి నీకై కుమిలి కుమిలి చనిపోయినది తల్లీ!

**విజయ** : బాబూ ! నీవు రామదేవరాయలవారి మేనమామ వని నాకు తెలియ వచ్చినది. కాని ఇపుడు నీవు చెప్పి నది నాకర్థమగుటలేదు. ఎవరితల్లి కుమలి కుమిలి చ్చినది ?

**యతి** : వినుము తల్లీ ! మాకు చిరకాలము బిడ్డలు పుట్టలేరి. మీతల్లి నోయని నోములులేవు, ఆచరించని వ్రతములు లేవు. మ్రొక్కని దైవములు లేరు. అవన్నియు ఇపుడు నాకు జ్ఞప్తికివచ్చి నన్ను దహించి పోవుచున్నది. నీవు మాకు కానక కన్న సంతానమువు. నీవు పుట్టిన దాది దాది అమ్మవలె దూని పాన్పున పెంచితిని. మీతల్లి పుట్టింటినుండి నిన్ను తీసుకొనివచ్చుచుండగా అడవిలోని చెంచులు మీతల్లిని, పరివారమును ముట్ట డించి కొందరి భటులను సంహరించి మీతల్లి అమూ ల్యాభరణములు తీసికొని పోవుచు మీనినింక అమూ ల్యాభరణములు ధరించియున్న నీ ముద్దుమాటల కలరియో - ఆభరణముల కాశించియో నిన్ను తీసి కొని పోయిరట. నాటినుండి మీతల్లి మంచము పట్టినది. మఱి లేవ లేదు. ఆరు సంవత్సరములు పర్యం తము నీకై విలపించుచు కృశించి కృశించి ప్రాణములు విడిచినది. నీవు పుట్టిన మూడవ మాసమున ఆమెయే నీకీ మచ్చను - మచ్చలోని పేరును పొడిపించినది. అమ్మా ! ఇటువచ్చి ఒకమారు నన్ను కౌగిలించు కొనుము. నిన్ను చూచినపుడెల్లను నీతల్లి గుర్తువచ్చు

చుండెడిది. మనుజులనుబోలిన మనుజు లుండరా యని సమాధానము చెప్పుకొని ఊరకుండువాడను.

ఈదిన మెంత సుదినము తల్లీ ! బ్రతికియుండుటచే ఎంతటి అదృష్టవంతుడనైతిని. పాపము మీతల్లియున్న ఎంత సంతసించియుండెడిదో గదా !

విజయ : తండ్రిగారు పెక్కు పర్యాయములు చెప్పుచుండెడివారు. ఆ చెంచీత నన్ను తనబిడ్డయని చెప్పుకొనినదట. ఆచిన్నవయస్సుననే నేను-అమ్మకాదు.—కాదు అని చెప్పితినట. చెంచెత తీసికొనబోవగా ఏడ్చెడిదాననట. మాతండ్రి రఘునాధరాయలు, ఆ చెంచుదంపతులను భయపెట్టి నన్ను,బుజ్జగించిననునిజము చెప్పకమూర్ఛించినారట. చెంచు దంపతులకును సంతానము లేదు. అందుచే వారు నన్ను విడువ సమ్మతింపరైరి.

యతి : మఱి ఎట్లు విడిచినారుతల్లీ ?

విజయ : దగ్గఅనే కూర్చుండియున్న మాతండ్రిగారు నా మణికట్టునందలి పచ్చను పేరును చూచి, చెంచు దంపతులతో "ఈబిడ్డ మిమ్ముచూచి యేడ్చుచున్నది. మీరు తలిదండ్రులు గారనుచున్నది. మీరేమో .ఈ బిడ్డ మా బిడ్డయే అనుచున్నారు. మీ బిడ్డయే యగుచో ఈమె పేరేమి " అని అడిగినారట.

వారికి నాపే రెట్లు తెలియును. నాకును అప్పటికి నాపేరేమి తెలియును ! అందుచే వారు ఏదో యూహించి

"విజయ" అని చెప్పినారట. మాతండ్రి వారిని భయ పెట్టి వారిని పట్టుకొని తంజావూరు తీసికొని రావలసి నదిగా భటుల కాజ్ఞాపించిరట. వారుగడగడ వడకుచు కలయావు చెప్పి తమదారిని తాము పోయిరట.

అప్పటి నుండియు నేను మా తండ్రిగారి యొద్దనే పెరుగుచున్నాను. చెంచుదంపతులు పెట్టిన విజయయే నా పేరైనది

యతి: ఎంత యదృష్టము తల్లీ! ఇక నాకు గాయములు లేవు గట్రలు లేవు. రమ్ము రఘునాథరాయలవారి యొద్దకు పోవుదమురమ్ము. ఇన్ని సంవత్సరములకు మఱలనిన్ను కనుగొనగల్గితిని. మీ తల్లి యున్నచో ఇపు డెట్టి యానంద సీమల సంచరించుచుండెదియో!



## 21· పట్టాభిషేకము

"మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సంపద లోలిం కొనివచ్చి యిచ్చి ముద మొప్పంగాంచి సేవించి"—నన్నయ.

ఇక మన కథా ఘట్టము ముగియవచ్చినది. యతిరాజు తన్ను క్షమింపవలసినదిగా రఘునాథరాయ యాచమరాయల నత్యంత వినయవిధేయతలతో ప్రార్థించెను. తనకు సంగతి సందర్భములు సరిగ వివరించి చెప్పక సాయపడ లనను వాగ్దానము తనయొద్దనుండి జగ్గరాజు ముందుగా పొంది అనంతరము తన్ను మోస పుచ్చెననియు, భార్య మరణము, బాలికాపహ

రణము, తన్ను విరక్తి పాల్సేసినందువలన "యేది ఎట్లైన నేమిలెమ్ము" అను నుపేక్షాభావముతో తాను యుద్ధమున దిగితి ననియు, చేజిక్కినను రామదేవరాయలను సంహారింప నని మాత్రము జగ్గరాజునకు గట్టిగా జెప్పితిననియు యతిరాజు చెప్పుచు కంటవెంట నీరు కార్ప జొచ్చెను. రఘునాథరాయ యాచనాయలు ఎంతయో యోదార్చిరి. ఓదార్చిన కొలది వాని దుఃఖ మినుమడించు చుండెను. విజయ వచ్చి తండ్రిని చాటుగా దీసికొని పోయెను.

ఒక శుభ ముహూర్తమున విజయా రామదేవరాయల వివాహ మతి వైభవముగా జరిగెను. ఆ శుభ సమయమున పాండ్యాధిపతియు, తుండీర మండలాధిపతియు బంధవిముక్తి గాంచిరి.

రఘునాథరాయలు యుద్ధ విజయమును సూచించు దిగ్జయ స్తంభమును కావేరీనదీ తీరమున ప్రతిష్ఠాపించెను.

కుంభకోణమునందు మంచి ముహూర్తమున విజయా రామదేవరాయ ప్రభువులకు పట్టాభిషేకము కావింపబడెను. సామంతు లందఱును రామదేవరాయ మహారాజులుంగారికి కానుకలు చెల్లించి కృత ప్రణాములై వినయ విధేయతలు ప్రకటించిరి. శ్రీమద్రాజాధిరాజరాజ పరమేశ్వర శ్రీ వీర ప్రతాపరామదేవరాయలకు జయముజయము—అను వంది మాగధస్తోత్రములు మిన్ను ముట్టెను.

సమాప్తము.

నేషనల్ ప్రింటింగ్ ప్రెస్, తెనాలి.

